c

మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక

ఏప్రియల్ - జూన్ 2016



## వివక్షపై ధిక్కారం...





కార్పొరేటర్లపై చర్యలు తీసుకోవాలని ప్రెస్‌మీట్‌లో దుర్గాభవాని, రమాదేవి, గంగాభవానీ తదితరులు




మంచినీటి సమస్యపై కర్నూల్ మున్సిపల్ ఆఫీస్ వద్ద ధర్నా




మెప్మా మహిళల రాష్ట్ర సదస్సులో మాట్లాడుతున్న తపశి ప్రహరాజ్



మోటూరి ఉదయం వర్ధంతి సభలో పాల్గొన్న పుణ్యవతి, మోటూరి ఉష, శాంతి తదితరులు




ఉచిత కళ్ళజోళ్ళ పంపిణీ కార్యక్రమంలో పి.విజయ, ఆర్.కొండలరావు



బ్రాండిక్స్ కార్మికులకు మద్దతు తెలుపుతున్న స్వరూపరాణి



కార్పొరేటర్ల అనుచిత చర్యలపై నిరసన కార్యక్రమం - విజయవాడ




నాగళ్ళ రాజేశ్వరమ్మ-జ్ఞాపకాలు పుస్తకావిష్కరణ సభలో పాల్గొన్న డా॥ జ్యోతి, డా॥ ఎస్.ఎస్.ప్ర
డా॥చంద్రశేఖర్, శ్రీవడ్డే శోభనాద్రీశ్వరరావు, యార్లగడ్డ జోయ, పి.మధు, ఎస్.పుణ్యవతి

సంపాదకీయం



# తిరోగమన సాంప్రదాయాలను తిరగరాస్తున్న మహిళలు

అసమానతలు లేని ప్రజాస్వామిక సమాజం మన స్వప్నం. ఆధునిక పునరుజ్జీవన ఉద్యమాల బాటలో స్వాతంత్ర్యానంతర భారతదేశం లౌకిక, ప్రజాస్వామిక రాజ్యంగా ఉండాలని ప్రతిజ్ఞ పూనాం. మరోవైపు తిరోగమన మనువాద భావజాలం పైచేయి సాధించి నిస్సిగ్గుగా సాంప్రదాయం పేరిట మౌఢ్యాన్ని, బానిసత్వాన్ని పెంచి పోషించే ప్రయత్నం సాగిస్తున్నాయి. ఈ ఘర్షణలోనే నేడు మహిళలు దేవాలయాల్లో వివక్షత ఎందుకంటూ ప్రశ్నిస్తున్నారు. ధిక్కరిస్తున్నారు. పోరాడుతున్నారు.

శబరిమలై దేవాలయం బోర్డు అధ్యక్షుడు "సరైన సమయం గురించి" చేసిన వ్యాఖ్య దుమారం రేపింది. మహారాష్ట్రలో గత నవంబర్‌లో శని శింగాపూర్ దేవాలయంలో ఒక మహిళ పూజ చేయటాన్ని సహించలేని సాంప్రదాయవాదులు శుద్ధితంతు నిర్వహించటంతో స్పందన పెల్లుబికింది. బొంబాయిలోని హాజీఆలి దర్గాలో మహిళల ప్రవేశాన్ని నిరాకరించటంతో విస్తృత ప్రజా వేదిక ఆవిర్భవించింది. ఇవి వేరు వేరు ఘటనలన్పించినా అన్నింటినీ కలుపుతున్న అంశం ఒక్కటే. ఆచారాల పేరిట పితృస్వామ్యాన్ని, ఆధిపత్యాన్ని కొనసాగించటమే. దీనిని ధిక్కరిస్తున్న మహిళలు తమని తాము (విలువ) గుర్తిస్తున్నారు. మానవ జీవితంలోని సకల పార్శ్వాలలో సమానత వెల్లివిరియాలని ఆకాంక్షిస్తున్నారు. ఎక్కడైతే వివక్షత ఉందో అక్కడ ప్రశ్నిస్తాం? సవాల్ చేస్తాం? పోరాడతాం? సాధిస్తామంటున్నారు. ఆధిపత్యం కాదు ప్రజాస్వామ్యం కావాలని కోరుతున్నారు. స్త్రీల లైంగికతను ఆసరా చేసుకుని సాంప్రదాయం పేరిట, పవిత్రత పేరిట పక్కన పెట్టడాన్ని అనేక ప్రాంతాలలో, మతాలలో ప్రశ్నించడం మొదలైంది. నిఖితా అజాద్, తృప్తిదేశాయ్‌లు ఈ ప్రశ్నలకు ప్రతిరూపాలు.

మహిళల ఋతుక్రమం అపవిత్రమయిందని, దూరంగా ఉండాలని, కీడని, శని చూపు గర్భస్థపిండాల మీద ప్రభావం పడ్తుందని రకరకాల ప్రచారాలతో స్త్రీలను దేవాలయాలకు దూరంగా ఉంచే ప్రక్రియ సాగిస్తున్నారు. నిఖితా ఆజాద్ దేవాలయ ప్రవేశం గురించి మాత్రమే కాదు, ఋతుక్రమం గురించి అవహేళనగా మాట్లాడటం నేరమని ప్రకటించింది. శారీరక సహజ ప్రక్రియను తప్పపట్టి, తక్కువచేసి, ఆడపిల్లలు అపరాధబావనతో పితృస్వామ్య భావజాలానికి లోబడి ఉంచే ధోరణిని ప్రశ్నించింది. లక్షల మంది మద్దతు పలుకుతున్నారు. ఐ.ఎ.ఎం అధ్యక్షుడు డా.త్యాగి వాస్తవానికి పురుషుడు ఋతుక్రమంతో జనిస్తున్నాడని, స్త్రీల యెడల గౌరవంతో మెలగాలని పేర్కొన్నారు. సహజమైన ప్రక్రియను పాపంగా, సిగ్గుపడే విషయంగా, అవమానంగా గాక ఆహ్వానించాల్సిన, చర్చించాల్సిన విషయంగా గుర్తించాలని యువత భావిస్తుంది. స్వచ్ఛ భారత్ గురించి ఆర్భాటపు ప్రచారం నడుస్తూనే ఉంది. విద్యాలయాల్లో, ఆఫీసుల్లో, బహిరంగ ప్రదేశాలలో వాష్‌రూమ్‌లు, టాయిలెట్లు అందుబాటులో లేక మూత్ర సంబంధమైన వ్యాధులకు అమ్మాయిలు గురవుతున్నారు. ఋతుక్రమం గురించి అవసరమైన జాగ్రత్తలు తీసుకోవాలి. పరిశుభ్రతను పాటించేట్లు ఏర్పాట్లుండాలి.

ఈ వైఖరి హిందూమతానికి మాత్రమే పరిమితం కాలేదు. హాజీఆలీ దర్గాలోకి 2011 వరకు మహిళలను ప్రార్థనకు అనుమతించారు. ఆ తరువాతనే ఆంక్షలు పెట్టారు. దర్గా అధిపతులు ఆడవాళ్ళ రక్షణ కోసం ,మంచికోసమే ఆంక్షలు పెట్టామని నమ్మబలుకుతున్నారు. వారుకూడా ఆడవాళ్ళ ఋతుస్రావాన్ని సాకుగా చూపించారు. భారతీయ ముస్లిమ్ మహిళా ఆందోళన ఈ వాదనను తిరస్కరించింది. మహిళల ప్రార్థనా హక్కును రక్షించాలని కోర్టులో పిటీషన్ దాఖలు చేసింది. సూఫీ అనుయాయిగా ఉన్న హాజీఅలీ దర్గాను లౌకిక విలువలకు ప్రతీకగా కొనసాగించాలని 27 సంఘాలతో ప్రజావేదిక ఏర్పడింది. ఈ చర్చలు క్రిష్టియన్ మతాన్ని కూడా తాకాయి. సోషల్ మీడియాలో క్రిస్టియన్ వర్గాలలో విస్తృత చర్చలు ప్రారంభమయ్యాయి. స్వామి స్వరూపానంద శాస్త్రాలను ధిక్కరిస్తే మహిళలపై అత్యాచారాలు పెరుగుతాయని, కరువు కాటకాలొస్తాయని మూఢత్వాన్ని పెంచి పోషించి ఆధిపత్యాన్ని, వివక్షతను కాపాడే ప్రయత్నం చేస్తున్నారు.

గుడిలో, చర్చిలో, మసీదులలో ,సమాజంలో అన్నింటా సమానత్వం కోసం దైవాన్ని విశ్వసించే వారు, విశ్వసించని వారందరూ పోరాట బావుటానెత్తారు. ప్రశ్నించటాన్ని సహించలేనిది పితృస్వామ్యం. కుల, వర్గ అసమానతలతో కూడిన సమాజం మహిళల అసమానతను ఆచారాల పేరిట, పవిత్రత పేరిట నిలబెట్టే ప్రయత్నం చేస్తుంది. కులం, మతం, సాంప్రదాయం, అపవిత్రత, కీడు, అంటరానిదంటూ సాగే సకల వివక్షతలను బద్దలుకొట్టే వైపు సాగుతున్న చైతన్యయుత పోరాటాలకు (ధిక్కారానికి) ఐద్వా జేజేలు పలుకుతుంది.

# చైతన్య మానవి

## ఈ సంచికలో




**అడ్వయిజరీ బోర్డు**

వేములపల్లి సత్యవతి
డాక్టర్ వకుళాభరణం లలిత
డాక్టర్ బి. విజయభారతి
డాక్టర్ శిలాలోలిత

**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఏ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక,
విజయవాడ.
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా**


పత్రికలో విభిన్న అంశాలపై వస్తున్న వ్యాసాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అందులో పేర్కొన్న అన్ని అంశాలతో మానవి సంపాదక వర్గం ఏకీభవిస్తుందని భావించవలదు.

– ఎడిటర్

వ్యాసం

# పరువు హత్యలు-హింస

- బృందాకరత్

భారతదేశంలో తమ జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకొని వివాహమాడుతున్న యువతీ యువకుల హక్కును పరువు పేరుతోనూ, సాంప్రదాయం పేరుతోనూ అణచివేస్తున్న వారిని శిక్షించేందుకూ మరియు యువతీ యువకులకు రక్షణ కల్పించేందుకూ ఒక పటిష్టమైన చట్టం అవసరం వున్నది. కానీ ప్రభుత్వాలు ఎన్ని మారినా దీన్ని గురించి పట్టించుకొనేవారే లేరు.

తమిళనాడులోని తిరుపూర్ జిల్లాలో ఉడుమల్‌పేట ప్రాంతంలో కులాంతర వివాహం చేసుకున్నందుకు గానూ, వి. శంకర్ అనే యువ ఇంజనీరింగ్ విద్యార్థిని ప్రజలందరూ చూస్తుండగానే అతిక్రూరంగా చంపారు. కులవ్యవస్థకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో అతడు అమరుడయ్యాడు. వేరే కులంలోని వారిని ప్రేమించినందుకు తమ జీవితాలను నష్టపోతున్న ఇటువంటి అనేకమంది యువకులను, వారిలో ఎక్కువమందిగా వున్న దళితులను, యువతులను, శంకర్ భార్య కౌసల్యలా గాయపడిన యువతులను, వారు ఎంపిక చేసుకున్న జీవిత భాగస్వాములను (వారిలో ఎక్కువమంది హిందువులు) మనం అమర వీరులుగానూ, హీరోలుగానూ గుర్తించాల్సి వుంది.

ఒక చర్చ సందర్భంగా కులాంతర వివాహాలను గురించి డా॥బి.ఆర్.అంబేద్కర్ గారు మాట్లాడుతూ "సామాజిక అణచివేత రాజకీయ అణచివేతకంటే క్రూరమైనదనీ, ప్రభుత్వాన్ని సవాలుచేసే ఒక రాజకీయ వేత్తకంటే, సమాజాన్ని సవాలుచేసే ఒక సంస్కరణవాదే గొప్ప ధైర్యవంతుడనీ చెప్పారు".

శంకర్ ఉద్దేశ్యపూర్వకంగా ఒక సంస్కరణ వాది కాకపోవచ్చు. కానీ అతడూ, అతని లాంటి ఎందరో యువకులు సామాజిక అణచివేతకు వ్యతిరేకంగా పోరాడుతూ తమ ప్రాణాలను ఫణంగా పెట్టారు. వారు భారత రాజ్యాంగాన్ని వాస్తవానికి అప్రతిష్టపాలు చేస్తున్న వేరొక పార్శ్వంపై దర్పణాన్ని సంధించారు. అవి సమాజంలో కొనసాగుతున్న భయోత్పాతం, అగౌరవం, కులవ్యవస్థ ద్వారా ఉత్పన్నమైన విషాల రంగులతో కూడుకొని, వర్గదోపిడి సృష్టించిన అసమానతలతో కలగలిసిన సమాజం మరియు తీవ్రమైన పితృస్వామ్య భావాలతో మహిళల మనస్సు, శరీరం, లైంగికతలను నియంత్రించే ఆచారాలు మొదలైనవి. మూడు 'C' ల కలయిక కులం (caste) వర్గం (class) మరియు మహిళలపై అదుపు (control over a women) తో కూడుకున్న గౌరవ హత్యలను సుప్రీంకోర్టు ఈ విధంగా వర్ణించింది. "ఒక అనాగరికమైన, క్రూరమైన, గట్టి గుడ్డి నమ్మకాలతో వున్న వ్యక్తులు చేసేవే ఈ గౌరవ హత్యలు" అని సుప్రీంకోర్టు చెప్పింది.

**కొనసాగుతున్న తిరస్కారాలు :** గౌరవం పేరుతో ఇటువంటి నేరాల సంఖ్య ఒకవైపు పెరుగుతున్నా, దేశవ్యాప్తంగా అనేక కోర్టులలో ఇటువంటి హత్యలను వ్యతిరేకిస్తూ అనేక తీర్పులు వెలువడినా కూడా ప్రభుత్వాలు మాత్రం ఇటువంటి నేరాలను అదుపుచేయడంలో తీవ్ర నిర్లక్ష్యం వహించాయి. ఈ గౌరవ హత్యలకు ఒక నిర్వచనం లేదు, ఈ నేరానికి సంబంధించిన వివిధ అంశాలకు సంబంధించి చట్టపరమైన (అవగాహన) గుర్తింపులేదు. జీవిత భాగస్వామిని స్వయంగా ఎంపిక చేసుకున్న జంటలకు చట్టపరమైన రక్షణ లేదు. వీరిపై జరుగుతున్న నేరాలను అదుపుచేసే చర్యలులేవు. ఈ నేరాలకు శిక్షలు లేవు. అంతేకాక ఇటువంటి నేరాలు చట్ట పరిధిలో లేవు కనుక ఈ నేరాలకు సంబంధించిన లెక్కలు కూడా అందుబాటులో లేవు. ప్రభుత్వ నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరోవారి లెక్కలలో ఈ నేరాలకు సంబంధించిన వివరాలు లేవు.

వాజ్‌పేయి ప్రభుత్వం ఉన్నప్పుడు కూడా ఇటువంటి తిరస్కార నేరాలు అధికంగా వుండేవని అందరికీ తెలుసు. కానీ ఇప్పుడు బి.జె.పి. పార్టీ ఎంపిగా వున్న ఎస్.ఎస్. అహ్లూవాలియా అప్పట్లో ఐక్యరాజ్య సమితి యొక్క సామాజిక, సాంస్కృతిక, మానవ సంబంధాల కమిటీ నిర్వహించిన ఒక చర్చాగోష్టిలో భారతదేశం తరఫున ప్రతినిధిగా మాట్లాడుతూ ఇటువంటి గౌరవ హత్యలు పాకిస్తాన్‌లోనూ, ఇస్లాం దేశాల్లోనూ తప్ప భారతదేశంలో లేవని చెప్పారు. మహిళలపై హింసకు సంబంధించి అప్పటి ప్రభుత్వ సూచనల ప్రకారం మాట్లాడిన ఆయన భారతదేశంలో గౌరవ హత్యలు లేవని వాదించారు. ఇటువంటి తప్పుడు వాదనపై మహిళా సంఘాలు తీవ్ర నిరసనలు తెలిపాయి. కానీ ప్రభుత్వం దానికి ఏమాత్రం సవరణలు చేయలేదు.

ఈ సమస్యపై పార్లమెంటులో కనీసం చర్చ అయినా జరపడానికి ఇంకొక 5సం॥రాల సమయం పట్టింది. గౌరవ హత్యలపై రాజ్యసభలో మొట్ట మొదటిసారిగా వామపక్షాలు చర్చను ప్రారంభించాయి. 2009 జులైలో పార్లమెంటులో పెట్టిన

చర్చ సందర్భంగా వివిధ పార్టీల సభ్యులు గౌరవ హత్యలపై మాట్లాడుతూ దీనికి ఒక ప్రత్యేక చట్టం వుండాలనే అంశాన్ని సమర్థించారు. దీనిపై అప్పటి హోంశాఖా మంత్రి పి. చిదంబరం మాట్లాడుతూ "గౌరవహత్యలపై ఒక ప్రత్యేక చట్టం తేవాలని సభ్యులు చాలా చక్కగా వివరించారు. కానీ ఇది చాలా చిన్న కోరికగా నేను భావిస్తున్నాను. దీనికి పరిష్కారం ఇంకొక చట్టం చేయడం మాత్రమే కాదు. మనం ఏ చట్టం చేసినా గౌరవ హత్యలను హత్యలుగానే చూడాలి. గౌరవ హత్యలకు ఏ విధమైన నిర్వచనమివ్వాలనే విషయాన్ని నేను పరిశీలిస్తాను. కానీ దానితో మనం ఎంత ముందుకు పోగలుగుతామనే విషయంలో నాకు ప్రాథమికంగా కొన్ని సందేహాలున్నాయి.

**వాజ్‌పేయి ప్రభుత్వం ఉన్నప్పుడు కూడా ఇటువంటి తిరస్కార నేరాలు అధికంగా వుండేవని అందరికీ తెలుసు. కానీ ఇప్పుడు బి.జె.పి. పార్టీ ఎంపిగా వున్న ఎస్.ఎస్. అహ్లువాలియా అప్పట్లో ఐక్యరాజ్య సమితి యొక్క సామాజిక, సాంస్కృతిక, మానవ సంబంధాల కమిటీ నిర్వహించిన ఒక చర్చాగోష్ఠిలో భారతదేశం తరపున ప్రతినిధిగా మాట్లాడుతూ ఇటువంటి గౌరవ హత్యలు పాకిస్తాన్‌లోనూ, ఇస్లాం దేశాల్లోనూ తప్ప భారతదేశంలో లేవని చెప్పారు. మహిళలపై హింసకు సంబంధించి అప్పటి ప్రభుత్వ సూచనల ప్రకారం మాట్లాడిన ఆయన భారతదేశంలో గౌరవ హత్యలు లేవని వాదించారు. ఇటువంటి తప్పుడు వాదనపై మహిళా సంఘాలు తీవ్ర నిరసనలు తెలిపాయి. కానీ ప్రభుత్వం దానికి ఏమాత్రం సవరణలు చేయలేదు.**

ఈ నేరాన్ని గుర్తించే విషయంలో అనేక వాదోపవాదాలు జరిగినప్పటికీ యుపిఎ ప్రభుత్వం ఈ విషయంపై ఒక విధానం విషయంలోనూ, దాని అమలులోనూ నిర్వహించిన పాత్ర వాజ్‌పెయి ప్రభుత్వం కంటే కొద్ది మేరకు మాత్రమే మెరుగుగా వున్నది. చిదంబరం కూడా చట్టపరంగా ఈ నేరం విషయంలో మెతక వైఖరినే కొనసాగించారు. ఏది ఏమైనప్పటికీ రాజ్యసభలో జరిగిన చర్చవలనా మరియు వామపక్ష పార్టీల నిరంతర కృషి వలన ఈ సమస్య న్యాయశాఖ పరిశీలనకు వచ్చింది. "భారతీయ నేరచట్టం మరియు కొన్ని ఇతర చట్టాల సవరణల బిల్లు 2010 " పేరుతో 2010సం॥లో కొన్ని సవరణలు వెలువడ్డాయి.

చిదంబరంగారి అసంపూర్ణ అవగాహన వలన మంత్రిత్వ శాఖ గౌరవ హత్యలను మాత్రమే పరిగణలోకి తీసుకుంది. కానీ యువజంటలు ఎదుర్కొంటున్న ఇతర వేధింపులను పట్టించుకోలేదు. ఈ సవరణల ముసాయిదాలో ఇంకా అనేక తీవ్రమైన లోపాలు వున్నాయి. యుపిఎ ప్రభుత్వం ఆనవాయితీ ప్రకారం ఒక నిర్ణయాన్ని వాయిదా వేయడానికి అనుసరించే ప్రముఖ మార్గం బిల్లులను మంత్రుల కమిటీకి సిఫారసు చేయడం. ఈ బిల్లును కూడా ఒకవైపు ప్రభుత్వ అలసత్వం ఇంకోవైపు బిల్లులో వున్న లోపాల కారణంగా మంత్రుల కమిటికీ సిఫారసు చేశారు. దీనితో ఈ బిల్లుకూడా వాయిదా పడింది. ఏది ఏమైన ప్పటికీ ఈ సవరణల ద్వారా మంచికంటే చెడే ఎక్కువ జరిగింది.

**సుదూరంగా వున్న చట్టపరమైన రక్షణ :** అఖిలభారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఆధ్వర్యంలో ఒక లీగల్‌సెల్ వున్నది. దానికి ఆధ్వర్యం వహిస్తున్న కీర్తిసింగ్ అనేకమంది వ్యక్తులతో, అనేక మహిళా సంఘాలతో చర్చించి 2010సం॥లో "గౌరవం, సాంప్రదాయం పేరుతో జరుగుతున్న నేరాల నివారణ బిల్లు" అనే పేరుతో ఒక సమగ్ర చట్టాన్ని తయారుచేసి దాన్ని ప్రభుత్వానికి అందజేశారు. ఈ బిల్లులో యువజంటల హక్కులను హరిస్తున్న కోణంలో గౌరవహత్యలను నిర్వచించారు. దీని ప్రకారం యువతీ యువకులతో సహా ప్రతి వ్యక్తికీ వారి జీవితాలపై వారికే నియంత్రణ హక్కు వుంది. వారికి స్వేచ్ఛగా జీవించే హక్కుతోపాటు భావప్రకటనా స్వేచ్ఛ, స్వేచ్ఛగా సంచరించే హక్కు సంఘ స్వేచ్ఛ ఉండాలి. ప్రతి స్త్రీకి, పురుషుడికీ తన జీవిత భాగస్వామిని వివాహం ద్వారా కానీ ఇతర పద్ధతుల ద్వారా కానీ ఎంచుకునే హక్కు వుండాలి. ఈ హక్కును నిరోధించేందుకు చేసే ఏ చర్య అయినా నేరంగా పరిగణింపబడుతుంది. ఆ విధమైన వివిధ నేరాల జాబితాను పరిశీలిస్తే అవి హత్యతోపాటు హక్కులను నిరోధించే చర్యలు, కులం, జాతి పేరుతో పనిచేసే ఖాప్ పంచాయితీలు లేక ఇతర సంస్థల లాంటివి. ఈ అంశాలలో పోలీసులు మరియు అధికార యంత్రాంగం జవాబుదారీగా వుండాలి. మహిళా సంఘాల వాస్తవ అనుభవాల ఆధారంగా తయారయినందున ఈ బిల్లులో అన్ని అంశాలూ పొందుపరచబడ్డాయి.

అప్పటి జాతీయ మహిళా కమీషన్ చైర్మన్‌గా వున్న గిరిజావ్యాస్ కూడా ఈ బిల్లును సమర్థించడమే కాక ఇదే విధమైన పేరుతోవున్న ఇంకొక బిల్లును కూడా ప్రభుత్వానికి అందించారు. జాతీయ మహిళా కమీషన్ మరియు మహిళా సంఘాలు ఉమ్మడిగా ఈ బిల్లుకోసం ఎన్నో ప్రయత్నాలు చేశారు. మంత్రుల కమిటీనీ, ప్రధాని మన్మోహన్ సింగ్‌నూ అనేకసార్లు ఈ

విషయంపై కలిశారు. కానీ వారు ఈ బిల్లును ముందుకు తీసుకెళ్ళే ప్రయత్నం చేయలేదు. 2సం॥రాల తరువాత భారత లా కమీషన్‌కు కూడా ఈ బిల్లును ప్రతిపాదించిన తరువాత 2012సం॥ ఆగస్టు నెలలో తన 242వ రిపోర్టులో భారత లా కమీషన్ ఈ బిల్లుపై తన స్వంత నివేదికను వెలువరించింది.

తన ముసాయిదా జాతీయ మహిళా కమిషన్ ముసాయిదా వలెనే వున్నదని అది పేర్కొంది. కానీ వాస్తవంగా అది చాలా సంకుచితంగా, అభివృద్ధి నిరోధకంగా వుంది. "చట్ట విరుద్ధ పంచాయితీల నిరోధం (వివాహ విషయాలలో స్వేచ్ఛలో జోక్యం) బిల్లు 2011" పేరుతో వున్న ఈ బిల్లులో ప్రాధమికంగా ఎంపిక వివాహాలను నిరోధించడానికి ఖాప్ పంచాయితీలు నిర్వహించే చట్టవిరుద్ధ పంచాయితీల గురించి పేర్కొన్నారు. కానీ వాస్తవంగా దీనికి సంబంధించిన ఇంకా అనేక విషయాలను ఈ బిల్లు పట్టించుకోలేదు. అంతేకాక ఈ బిల్లునే ప్రభుత్వం అన్ని రాష్ట్రాలకు చర్చలకోసం పంపించింది.

మోడీ ప్రభుత్వం ఏర్పడిన కొన్ని నెలలకు ఐద్వా ప్రతినిధి బృందం ఈ విషయంపై న్యాయశాఖా మంత్రి సదానంద గౌడ్‌ను కలిసింది. అసలు దీనికి చట్టమే అవసరం లేనట్లు ఆయన మాట్లాడడమే కాక సెక్షన్ 498ఎ (భారత నేర చట్టంలోని వరకట్న వేధింపులు, గృహ నిరోధకచట్టం) వలె ఈ చట్టం కూడా దుర్వినియోగమయ్యే అవకాశాలున్నాయని చెప్పారు. లా కమీషన్ సిఫారసులపై రాష్ట్ర ప్రభుత్వాల స్పందన కోసం తాము ఇంకా వేచి చూస్తున్నామని 2015సం॥ ఆగస్టులో మంత్రిత్వశాఖ ఒకలేఖ పంపింది. అందువలన ఈ చట్టం ఒక అడుగు ముందుకు, రెండు అడుగులు వెనక్కు అన్నట్లు వున్నది. భారత దేశానికి ఒక చట్టం అవసరం వుంది. ఎంపిక వివాహాలను కాపాడేందుకు, ఆ హక్కును గౌరవం, సాంప్రదాయం పేరుతో కాలరాచే వారిని శిక్షించేందుకు ఒక పటిష్టమైన చట్టం అవసరం వుంది.

మనం గౌరవ హత్యలపై ఒక చట్టం తీసుకురాకుండా ఓటు బ్యాంకు రాజకీయాలకు లోబడి అభివృద్ధి నిరోధక శక్తులైన ఛాందస కుల పంచాయితీలను సంతృప్తి పరిచేందుకు ప్రయత్నిస్తే ఆ శక్తులు ప్రభుత్వ అధికారాలను ధిక్కరించడమే కాక పౌరుల ప్రజాస్వామ్య హక్కులను, రాజ్యాంగ హక్కులను కాపాడాలని ప్రయత్నించే వారిపై కూడా ఆధిపత్యానికి ప్రయత్నిస్తాయి.

హిందూకోడ్ బిల్లులో మహిళల హక్కులను నీరుగార్చినందుకు నిరసనగా అప్పటి న్యాయశాఖ మంత్రిగా వున్న డా॥ అంబేద్కర్ తన పదవికి రాజీనామా చేశారు. ఆయన తరువాత ఆ పదవిలో వున్న నేటి నేతల చర్యలు ఆయన 125వ జయంతి సంవత్సరంలో ఆయన వారసత్వానికి వెక్కిరింతగా మారడం చాలా విచారకరం. **- అనువాదం కె. నాగలక్ష్మి**

# జిషా హత్య



ఏప్రిల్ 28వ తేదీన ఎర్నాకులం జిల్లాలోని పెరంబవార్ గ్రామంలో జిషా దారుణంగా హత్యచేయబడింది. ఈ దుర్మార్గమైన ఘటనకు ముందు ఆమె తల్లి రాజేశ్వరి తమను వేధిస్తున్నవారిపై ఫిర్యాదిచ్చింది కాని ఆ ఘటనపై పోలీసులు స్పందించలేదు. దళిత కుటుంబానికి చెందిన రాజేశ్వరి భర్త కుటుంబాన్ని వదిలేసి వెళ్ళిన తరువాత ఇద్దరు అమ్మాయిలను పెంచి పెద్దచేసింది. పేదరికంలో ఒంటరితనంతో ఉన్న జిషాకు న్యాయం కల్పించాలని. కేరళలో అత్యాచారానికి గురై చంపబడిన జిషాకు న్యాయం జరగాలని నిందితులను, అనుమానితులను తక్షణం అరెస్టు చేయాలని నిష్పక్షపాతమైన, విశ్వసనీయమైన విచారణ జరిపించాలని జిషా తల్లి ఇచ్చిన ఫిర్యాదుపై స్పందించని పోలీసు అధికారులపైన చర్యలు తీసుకోవాలని కోరుతూ ఐద్వా, అన్హాద్ (anhad), జెడబ్ల్యూపి, దళిత మహిళ సురక్ష సమితి, స్త్రీముక్తి సంఘటన సంఘాలు మే 9వ తేదీన కేరళ భవనం ముందు ధర్నా నిర్వహించారు. కేరళ భవనంలో వున్న రెసిడెంట్ కమిషన్‌కు మెమొరాండం యిచ్చారు. 25-5-2016న కేరళలో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే ముఖ్యమంత్రి పినరయ్ విజయన్ జిషా హత్య కేసులో సమగ్ర న్యాయ విచారణకు ఆదేశించారు. అసిస్టెంట్ డిజిపితో కమిటీ వేసి నివేదిక అందజేయాలని తల్లికి నెలకు రూ.5000/- పెన్షన్ ఇవ్వాలని, సొంత ఇంటి నిర్మాణం రెండు నెలల్లో పూర్తి చెయ్యాలని ఆదేశించారు. విచారణ జరుగుతుంది.

కథ

# తొందరపడి ఒక కోయిల...

జి.లక్ష్మి

వంటగది సర్ది సిలిండర్ కట్టేసి లైటార్పి హాల్లోకొస్తూ టైమ్ చూసింది శర్వాణి. పదిన్నర. ఒక్కసారి నవ్వొచ్చింది శర్వాణికి. టైమ్ చూడకుండానే పదిన్నర అయుంటుందని ఆమెకు తెలుసు. పని ఎప్పుడు మొదలుపెట్టినా, ఎక్కడ మొదలుపెట్టినా ఎన్ని పరుగులు పెట్టినా;ఉదయం పది అవ్వాల్సిందే. రాత్రి పదిన్నర అవ్వాల్సిందే. ఆ టైమ్‌ని మార్చి చూద్దామని ఎన్నిరకాలుగా ప్రయత్నం చేసినా ఆమెకు ఈ పదేళ్ళలో సాధ్యం కాలేదు. ఉదయం కూడా అంతే. ఎంత త్వరగా మొదలుపెట్టి ఇంట్లోనుండి బైటపడాలని ఎంత ప్రయత్నించినా అదే టైము. ఆ అరగంటలోనే చెమటలు కక్కుకుంటూ ఆఫీసుకు పరిగెత్తి సీట్లో కూర్చుని టైమ్ చూసేటప్పటికి పదీ నలభై చూపిస్తుంటుంది గడియారం. తను కాలేజీలో చదివేటపుడు ఇంగ్లీష్ లెక్చరర్ ఎప్పుడూ ఒక మాట అంటుండేవాడు 'రెగ్యులర్లీ ఇర్రెగ్యులర్' అని. తనకి ఆమాట ఖచ్చితంగా సరిపోతుందని నవ్వుకునేది ఎన్నోసార్లు. ఉద్యోగానికి వెళుతున్నానా, ఒలంపిక్ పరుగుపందానికి వెళుతున్నానా అనిపించేది. తర్వాత నిదానంగా అర్ధమయింది తను దాన్నీ మార్చలేదని. అది అలా జరగాల్సిందేనని.

బెడ్‌రూమ్‌లోకి వెళ్ళబోయే ముందు అలవాటు ప్రకారం పిల్లల గదికి వెళ్ళి చెల్లా చెదురుగా పడిన పుస్తకాలు సర్ది రాహుల్‌కి బెడ్‌షీట్ కప్పింది. శ్రీజకు కప్పబోతుండగా బెడ్‌లైట్ వెలుతురులో శ్రీజని చూసి ఉలిక్కిపడింది శర్వాణి. శ్రీజ బుగ్గలపై కన్నీళ్ళు ఎండి చారికలు కట్టిన ఆనవాళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నిద్రలో కూడా శరీరం ఏదో తెలీని బాధతో సన్నగా ఎగిరెగిరి పడుతోంది. పెదాలు అస్పష్టంగా కలవరిస్తున్నాయి. శ్రీజను ఆ స్థితిలో చూసి శర్వాణి మనసు చివుక్కుమంది. శ్రీజ అన్నం కూడా సరిగా తినలేదు. అన్నం తినిపిస్తున్నంతసేపూ వెక్కిళ్ళు పెడుతూనే వుంది. చివరికి పొలమారి తిన్నదంతా వాంతి చేసుకొని తోటకూర కాడలా వేలాడిపోయింది. శర్వాణి మనసు గిలగిలా కొట్టుకుంది. అనవసరంగా పసి మనసుని చిత్రహింసలు పెడుతున్నామా అందరం కలిసి అనిపించింది. శ్రీజ బుగ్గలు తుడిచి దుప్పటి సర్ది తలుపు దగ్గరగా వేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళేటప్పటికి శ్రీరామ్ మేగజైన్ చూస్తున్నాడు. శర్వాణి అడుగుల చప్పుడు విని తలెత్తకుండానే "శ్రీ నిద్ర పోయిందా"? అని అడిగాడు. "నిద్రపోయిందండి. నిద్రలో కూడా అది ఏడుస్తున్నట్టు అనిపించింది. ఏంటో తప్పు చేస్తున్నామా? అసలు దాన్ని ఇంత హింస పెట్టి ఇదంతా అవసరమా" అని ఏడ్చింది మొదటిసారిగా. "మీరు ఎప్పటి నుంచో అంటూనే ఉన్నారు. ఏ కళా నిర్బంధం అవ్వకూడదు. నిర్బంధం అయితే అందులో ఏ ఆనందం ఉండకుండాపోతుందని. శ్రీజని చూస్తుంటే అది అక్షరాలా నిజమనిపిస్తుందండి" శర్వాణి అంది బాధగా.

"అది చిన్నప్పుడు పాటలు పాడేటపుడు ఎంత సరదాగా ఎంత హుషారుగా పాడేదో గుర్తుందా? ఇప్పుడు చూడు ఎంత బాగా పాడుతున్నా ఏదో బెదురు. ఏదో అసంతృప్తి. బాగా పాడుతున్నానా లేదా అన్న అపనమ్మకం. రిహార్సల్స్ చేస్తున్న ప్రతిసారీ బాగా వస్తోందా లేదా అని ఒకటికి నాలుగుసార్లు అడుగుతోంది. అంకుల్ ఏమంటారో, ఆంటీ ఏమంటారో, నచ్చింది అంటారో లేదో అని ఆందోళన పడుతోంది. రామచిలక చెట్టుమీద ఉండి పాడే పాటకీ, పంజరంలో ఉండి పాడే పాటకూ తేడా ఉండదూ. ఇదీ అంతే" నిట్టూర్చాడు శ్రీరామ్. శ్రీజ వాళ్ళ స్కూల్ ప్రిన్సిపాల్ అక్కడికీ పాపం చెబుతూనే ఉంది. "మేడమ్! మీరు అలా ఊరుకుంటే ఎలా? మనది కొంచెం చిన్న స్కూల్. మహా అయితే వెయ్యి మంది ఉంటారు. స్నేహ చదివే స్కూల్ రెండువేలపైన ఉంటుంది. వాళ్ళకు ఇంకో మూడు నాలుగు బ్రాంచీలు ఉన్నాయి. స్నేహ టీచర్లందరూ పిల్లలకు అదేపనిగా చెప్పి పిల్లలతోనూ, వాళ్ళ పేరెంట్స్‌తోనూ స్నేహ కోసం ఒకటే ఎస్సెమ్మెస్‌లు పంపుతున్నారంట. మా స్కూల్లో కూడా పిల్లలు అందరికీ చెప్పి ఎస్సెమ్మెస్‌లు పంపిస్తున్నాం. కానీ అది సరిపోదు. మీరు కొంచెం యాక్టివ్‌రోల్ తీసుకుని మీ చుట్టాలు, ఫ్రెండ్స్, తెలిసినవాళ్ళందరికీ ఫోన్లు చేసి చెప్పి శ్రీజ పేరుతో ఎస్సెమ్మెస్ పంపమని చెప్పండి. శ్రీజ ఎంత బాగా పాడినా ఎవరికి ఎస్సెమ్మెస్‌లు ఎక్కువ వస్తే వాళ్ళు విజేత అంటున్నారుగా. అందుకే ఇంతగా చెబుతున్నాను. మొన్న ఆ చానెల్ వాళ్ళు స్కూల్‌కి వచ్చి మమ్మల్ని అందర్నీ ఇంటర్వ్యూచేసి వెళ్ళారు. శ్రీజ పుణ్యమా అని మా స్కూల్‌కి ఒక్కసారిగా మంచి గుర్తింపు వచ్చింది. తను

ఫస్ట్ ప్రైజ్ గెలుచుకోవాలని మా అందరి కోరిక, తాపత్రయం. నా మాట విని మీరు కూడా అందరితో మెసేజ్‌లు ఇప్పించండి" అంటూ నాలుగురోజుల కిందట ఫోన్ చేసి గంటపాటు ఒకటే గొడవ. కానీ ఏం చెబుతాం? సిల్లీగా ఉండదూ? మా అమ్మాయి బాగా పాడిందని ఎస్సెమ్మెస్‌లు పంపండి అని ఎవరికైనా అసలు ఎలా చెబుతాం? వాళ్ళంతట వాళ్ళకి అనిపించి వాళ్ళు పంపితే అది వేరే విషయం కానీ" అంది శర్వాణి.

"అది ఒక్కటే చాలదు వాణి. చెయ్యాలంటే ఇంకా చాలా చెయ్యాలి. చేయించాలి. స్నేహ వాళ్ల అమ్మా నాన్నలాగా నువ్వు కూడా శ్రీజను తీసికెళ్ళి జడ్జిల కాళ్ళకు దండాలు పెట్టించగలవా? వాళ్ళను పొగుడుతూ మీ అంతవాళ్ళు లేరనగలవా? చుట్టరికాలు కలపగలవా? ఒక్క స్నేహ వాళ్ళ అమ్మా నాన్నా అనే కాదు ఇందులో ఉన్నవాళ్ళంతా అదే చేస్తున్నారు. రాత్రీ పగలూ అదే ధ్యాసగా పిల్లలకు తర్ఫీదు ఇచ్చి పాటల పోటీలకు పంపడం, పాటల్ని వాళ్ళ మీద బలవంతంగా రుద్దడం తప్ప వాళ్ళు ఇంకేం చేయడం లేదు. పరీక్షలకు పాఠాల్ని బట్టీ పట్టించినట్టు పోటీల కోసం పాటల్ని బట్టీ చేయిస్తున్నారు. మనం అలా ఎప్పటికీ చేయలేం. పాట పాడటం అనేది మనసుకి ఆహ్లాదం కలిగించాలి కానీ అదే ఉరిశిక్ష అవకూడదు. ఇంక దాని గురించి బాధపడకు. వదిలేయ్" అనునయంగా అన్నాడు శ్రీరామ్.

"మన అమ్మాయి అని కాదు కానీ ఏమండీ మీరు చెప్పండి శ్రీజ బాగా పాడిందా? ఆ స్నేహ బాగా పాడిందా? శ్రీజ గొంతులో ఎలాంటి ఫ్లో లేదు. ఓపెన్‌గా సాఫీగా ఉంటుంది. పైగా పాడడం కూడా చాలా కాజువల్‌గా ఎలాంటి ఎఫర్ట్ పెట్టకుండా పాడుతుంది. ఆ స్నేహ అవడానికి శ్రీజ కన్నా చిన్నది. ముద్దు ముద్దుగా ఉంటుంది. ముద్దు ముద్దగా మాట్లాడుతుంది. కానీ పదాల ఉచ్చరణలో స్పష్టత ఉండదు. టెక్నికల్‌గా కరెక్ట్‌గానే పాడి ఉండొచ్చు కానీ శ్రీజ గొంతులో ఉన్న మెచూరిటీ ఆ పిల్ల గొంతులో ఉండదు. ముద్దు ముద్దుగా పాడినంత మాత్రాన, ఎలాంటి తప్పులు లేకుండా కష్టమైన పాటలు కూడా బాగా పాడినంత మాత్రాన చక్కగా పాడినట్టేనా? అవతల చిన్న పిల్లలు. ఒకళ్ళని బాగా పాంపర్ చేస్తే మిగిలిన వాళ్ళు నొచ్చుకుంటారన్న ఇంగిత జ్ఞానం అన్నా ఆ జడ్జీలకు లేకపోతే ఎట్లా? ముద్దొస్తే అది వేరేగా చూపించవచ్చు. ఏ స్పెషల్ ప్రైజో ఇవ్వొచ్చు. కానీ అన్ని అన్ని తప్పులు చేసినా ఆ పిల్లని పాయింటవుట్ చెయ్యకపోవడం, అసలు ఇంత కష్టమైన పాటని నీ అంత చిన్న పిల్ల అంతా గుర్తుంచుకుని పాడటమే గొప్ప అంటూ ఆకాశానికి ఎత్తేయడం, ఏ తప్పూ లేకుండా చక్కగా పాడినా మిగిలిన వాళ్ళని ఏదో వంకపెట్టి విమర్శించడం, లేకపోతే మెచ్చుకోకుండా ఉదాశీనంగా ఉండిపోవడం... ఆ పసిపిల్లలకు ఏం తెలుస్తాయి చెప్పండి ఈ రాజకీయాలన్నీ" ఆవేశంగా అంది శర్వాణి.

"వాణీ ! అన్నీ తెలిసిన నువ్వు కూడా ఇలా మనసు పాడు చేసుకుంటే ఎలా? చిన్నపిల్ల అదంటే ఏదో తెలీక ఏడ్చింది. అందుకే నేను అసలు ఈ పోటీలకు వద్దంది. సమాజంలో ఉన్న కుళ్ళంతా ఈ పోటీల్లో లేదనా నీ ఉద్దేశం? కాస్ట్, ఫ్యాక్టర్లు, రెలిజియన్ ఫ్యాక్టర్లు, ప్రాంతీయ బేధాలు, జిల్లాల వారీ అభిమానాలు ఎన్ని ఉన్నాయి? అసలు ఎవరికి ఇవ్వాలి అనేది కూడా ప్రీప్లాన్డ్ అనే నా అభిప్రాయం. ఇందులో ఇంకో కుట్ర ఎస్సెమ్మెస్‌లు పంపడం. ఒక్కో ఎస్సెమ్మెస్‌కు రెండో మూడో రూపాయలు అవుతుంది. ఎన్ని ఎస్సెమ్మెస్‌లు పంపితే మీ ఛానెల్స్‌కు అంత మంచిది. అందులో వాళ్ళకు వచ్చే కమీషను కూడా పెరుగుతుంది. యాడ్‌ల నుండీ వచ్చే ఆదాయానికి ఇది అదనం. కళలకు ప్రోత్సాహం కాదు. కళలంటే అభిమానం కాదు. ఏదో రూపంగా వాళ్ళకు బిజినెస్ పెరగాలి. ఇంత పెద్ద నెట్‌వర్క్‌లో పిల్లలు, వాళ్ళ పసిమనసులు ఇక్కడ ఎలా ఇముడుతారు చెప్పు"? నిట్టూర్చాడు శ్రీరామ్.

"పిల్లల మనస్సులు బాధపెట్టడానికి కాకపోతే ఆ ఎస్సెమ్మెస్‌లు ఎందుకండీ? అసలు మన శ్రీజా ఫస్ట్ వచ్చేది. ఎస్సెమ్మెస్‌ల ప్రకారం అంటూ స్నేహా ఫస్ట్ వచ్చినట్లు ఇందాక ప్రకటించారు. ఇది అన్యాయం కదూ. వాళ్ళ రంగంలో నిష్ణాతులు కదా జడ్జీలని నియమించేది? వాళ్ళకి జడ్జిమెంట్ పవర్ ఇచ్చింది. శ్రీజ బాగా పాడిందనే కదా వాళ్ళు ఫస్ట్ వచ్చిందని అనౌన్స్ చేసింది. వాళ్ళ నిర్ణయం కరెక్టా? రకరకాల ప్రభావాలు పనిచేసే ఎస్సెమ్మెస్‌లు కరెక్టా? ఆ మాత్రం దానికి ఇంక జడ్జీలు ఎందుకు? కష్టపడి అన్ని నెలల పాటు చదువూ సంధ్యా, తిండీ నిద్రా వదులుకుని అది తపస్సులా సాధించి తెచ్చుకున్న ప్రైజ్ అండీ అది. మిగిలిన వాళ్ళలా పాకులాడకపోవడం మన తప్పా"? శర్వాణి గొంతులో బాధ.

"శ్రీజ బాగా ఉత్సాహపడుతోందండి. రెండుమూడు రియాల్టీ షోలకి వెళితే దానికీ బెదురుపోయి కాన్ఫిడెన్స్ వస్తుందని

నువ్వు మరీ మరీ చెబితే పోనీ చిన్నపిల్ల కదా దాని సరదా ఎందుకు కాదనాలి అని సరే అన్నాను. కానీ ఇన్ని నెలల పాటు చదువులో వెనకపడకుండా స్పెషల్ కోచింగ్ తీసుకుంటూ, సంగీతం నేర్చుకుంటూ, పాటలకోసం స్పెషల్ కోచింగ్ తీసుకుంటూ అది ఎంత నరకం పడిందో తల్చుకుంటే ఇప్పుడు బాధేస్తోంది" అన్నాడు శ్రీరామ్.

ఆ విషయం శ్రీరామ్ కన్నా తనకు బాగా తెలుసు అనుకుంది శర్వాణి. శ్రీరామ్ అంతా తనమీదే వదిలిపెట్టి వూరుకున్నాడు. తను సెలవు పెట్టి మరీ శ్రీజతో పాటు అన్ని ఊళ్ళూ తిరగాల్సి వచ్చింది. పోటీలకు వెంటపెట్టుకుని తీసుకుని వెళ్ళడం, ప్రాక్టీసు చేయించడం, చదువులో వెనకపడకుండా చూడడం అంతా తన పనే. ఒక్కోసారి ఒక్కోపాట నేర్చుకోవ దానికి వారం రోజులు పట్టేది. ఆ వారం రోజులూ నిద్రపోతు న్నప్పుడు, అన్నం తింటున్నపుడు తప్ప ఆ పాటనే ప్రాక్టీసు చేస్తూ ఉండేది. పాట రికార్డు పెట్టుకుని వినడం, పాడడం ఇంక అదేపని. ఒకోసారి తనకు విసుగొచ్చి ఇంక చాల్లే ఇవాల్టికి పడుకోమ్మా అనేది. ఉహు! ఈసారి అంకుల్‌తో ఎలాగన్నా సరే బాగా పాడాను అనిపించుకోవాలి అనేది. ఆ పాటతో ఇల్లూ, వాకిలీ ఆ వారం రోజులు ప్రతిధ్వనించిపోయేది. ఎప్పుడైనా అలసిపోయి నిద్రకు తూగుతున్న కళ్ళతో "అమ్మా ఇవాల్టికి పడుకోనా" అనేది. ఇంకాసేపు ప్రాక్టీసు చేసుకోమ్మా కొంచెం పాలు కలిపి ఇస్తాను అంటే సరేనని మళ్ళీ ప్రాక్టీసు చేసేది. ఆదివారం, సెలవురోజుల్లో అపార్ట్‌మెంట్‌లోని పిల్లలంతా గ్రౌండులో గోలగోలగా ఆడుకుంటుంటే వాళ్ళ వంక ఆశగా చూసేది తప్ప ప్రాక్టీసు మానేది కాదు. తనకే బాధ అనిపించేది. చక్కగా ఆడుతూ పాడుతూ స్వేచ్ఛగా తిరగాల్సిన పిల్లకి ఇదంతా అవసరమా? దీనివల్ల ఏం ఆనందం కలుగుతోంది? లేని పోని టెన్షన్, అనవసరపు వత్తిడి, ఆందోళనా తప్ప అని,

ఆ మధ్య ఎప్పుడో టీవీ వార్తల్లో చూసింది. రియాల్టీషోలో సరిగా పెర్‌ఫార్మ్ చేయలేదని జడ్జీలు క్వాలిఫై చేయకపోతే ఒక చిన్నపిల్లవాడు ఆత్మహత్య చేసుకున్నాడట. అది విని ఎంత వణికిపోయింది తను? అప్పటినుండీ శ్రీజకు ఎప్పుడూ ఒకటి చెబుతూ వచ్చింది. పాటలోని ఆనందాన్ని అనుభవించు. పాట పాడడాన్ని ఎంజాయ్ చెయ్యి. అది ఎప్పటికైనా ఫలితాన్ని తెస్తుంది. ఈ లోగా డిజప్పాయింట్ అవకు అని? మొన్న ఒక కొలీగ్ చెబుతోంది.

ఏదో రియాల్టీ షోలో పాల్గొన్న ఒక అమ్మాయి వాళ్ళ పక్క అపార్ట్‌మెంట్‌లోనే ఉంటుందట. ఒక షోలో సరిగా పాడలేదని ఆ అమ్మాయి పేరెంట్స్ ఇంటికి వచ్చిన తర్వాత ఆ అమ్మాయిని తిట్టి కొట్టి హింస పెట్టారట. శ్రీజ లక్కీ మీరు తనని చక్కగా పెంచుతున్నారు అంటూ మెచ్చుకుంది. ఏం పెంచడమో ఏమో? ఈ మధ్య శ్రీజ పాటలు పాడుతుంటే అప్పటి ఉత్సాహం కనిపించడం లేదు. అంత ఈజ్‌తో పాడలేక పోతోంది. తను పాడేపాట అంకుల్‌కీ, ఆంటీకీ నచ్చుతుందా లేదా అన్నట్టు బెరుకు బెరుకుగా పాడటం తప్ప ఇదివరకులా ఎంజాయ్ చేస్తూ పాడలేకపోతోంది. " సరిగ్గా పాడినా స్నేహలాగా నన్నెందుకు అంత మెచ్చుకోవడం లేదమ్మా?"అంటూ మాటి మాటికీ అడుగుతోంది. కాని లేత మనసు ఎక్కడో దెబ్బతింది. అంతకుముందు పోటీలో కూడా అంతే. శ్రీజ ఫస్ట్ వస్తుందని అందరూ అన్నారు. కానీ చివరికి సెకండ్ ప్రైజ్ ఇచ్చారు. ఇంకో పోటీలో అది కూడా రాలేదు. సెమీస్‌లోనే వెనక్కు పంపారు. ఆ రోజంతా ఏడుస్తూనే వుంది శ్రీజ.

పెద్దయిన తర్వాత లైఫ్‌లో ఎటూ డిజప్పాయింట్‌మెంట్లు తప్పవు. ఇంత చిన్న వయస్సులో హాయిగా ఆడిపాడాల్సిన వయస్సులో దానికి ఇన్ని డిజప్పాయింట్‌మెంట్లు, ఇంత దు:ఖం అవసరమా? ఎవరో నడిపే వ్యాపారానికి ఆ పసిది ఎందుకు వ్యాపార వస్తువు అవ్వాలి? పాట ఆనందాన్ని ఇవ్వడం పోయి నిర్బంధం ఎందుకు అవ్వాలి? ఛానల్స్‌ని వాళ్ళ వ్యాపారాన్ని వాళ్ళని చేసుకోనీ. ఆ వ్యాపారాన్ని ఇష్టపడే తల్లిదండ్రులు తోమి రుద్ది చదువుల్లాగే పాటల్ని కూడా పిల్లలతో బట్టీ పట్టించుకోనీ. చదువుల్లో వెనకపడో, బట్టీ పట్టలేకో మార్కులు సరిగా రాలేదనో కార్పొరేట్ కాలేజీల పిల్లలు ఆత్మహత్య చేసుకుంటున్నట్టు పాటల పోటీలు కూడా చదువులాగానే వ్యాపారం అయిపోనీ. రకరకాల ఇరుకు సందుల్లో పడి ఆ జడ్జీలు కూడా అలా కొట్టుకుపోనీ. తను మాత్రం తన శ్రీజను, తన బంగారు తల్లిని ఈ కసాయి పోటీలకు అప్పగించదు. దానికి ఇష్టమైతే పాడుకోనీ లేకపోతే లేదు. అంతే శర్వాణి ఒక నిర్ణయానికి వస్తోంది.



## (వ్యాసం) స్ఫూర్తి కిరణం - జగ్మతీ సంఘ్వాన్

అది 1980వ సంవత్సరంలో ఓ శీతాకాల మధ్యాహ్నం. జాతీయస్థాయి క్రీడాపోటీలు. భారత దేశంలోని రెండు మహిళా జట్లు తలపడాల్సిన కోర్ట్. తమిళనాడు రాష్ట్ర జట్టు ఆడటానికి సిద్ధంగా బరిలో ఉంది. హర్యానా రాష్ట్ర మహిళా జట్టు మాత్రం డ్రెస్సింగ్ రూమ్ తలుపులు బిడాయించుకుని బయటకు రావడం లేదు. ఉత్తర, దక్షిణ దిక్కుల్లాగా. ఆ రెండు జట్ల మధ్య కేవలం ఆటల పోటీనే కాక, ఆలోచనా వైరుధ్యం కూడా ఉంది.

ఆటలపోటీ నిర్వహించవలసిన అఫీషియల్స్ కోపంతో మండిపడుతున్నారు. అందులో ఒకరు "ఈ ఆడపిల్లలు ఆడటానికి ఒక పోటీ, అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞత చూపించడం మానేసి, చాలా దుందుడుకుగా వ్యవహరి స్తున్నారు". అతని మాటలకు ఏకీభవించే తలలే అక్కడన్నీను. ఈ వ్యాఖ్యానాలతో "సంధి"కి సంబంధించి వాద ప్రతివాదనలు తీవ్రస్థాయిలో జరుగుతున్నాయి.

అంతర్జాతీయ పోటీలలో మెక్సికో, దక్షిణ కొరియా టీమ్‌లతో తలపడి వచ్చిన భారతీయ బృందంలోని ఓ క్రీడాకారిణి, ఆయా దేశాల్లో మహిళా క్రీడాకారిణులకున్న వసతి సౌకర్యాలు, గౌరవం అన్నీ పరిశీలించింది. భారత దేశంలో మహిళా క్రీడాకారుణుల పట్ల క్రీడారంగంలోని అసమానత్వం, దృష్టికోణంలో చులకన, సౌకర్యాల కల్పనలో వివక్షతపై స్పష్టమైన అవగాహనతో పట్టుదలగా వాదిస్తుందామె.

"మంచి క్వాలిటీ కిట్ ( క్రీడా దుస్తులు), షూస్, బంతులు, ఉన్నతస్థాయి క్రీడా శిక్షణా వసతులు, ఆహారానికిచ్చే అలవెన్స్ పెంపుదల, క్రీడాకారులతో సమానమైన అన్ని రకాల సదుపాయాలు" ఆ ఆరుగురు బృంద సభ్యులకు కేటాయిస్తామని, పోటీ ముగిసిన వెంటనే అన్నీ ఏర్పాటు చేస్తామన్న స్పష్టమైన అంగీకారం అధికారుల నుండి అందిన తర్వాత ఆ బృందం బయటకు వచ్చి, పోటీ బరిలో దిగింది. ఆ బృంద నాయకురాలు "జగ్మతీ సంఘ్వాన్". అప్పుడామె వయస్సు 20 సంవత్సరాలు మాత్రమే.

**యుద్ధ నినాదాలు:**

గత 35 సంవత్సరాలుగా సంఘ్వాన్ జీవితంలో స్థిరంగా ఉన్నది ఒక్కటే! అదే "సంఘటితంగా ప్రతిఘటిస్తేనే ఏదైనా సాధిస్తామని". సమానత్వం కోసం, ప్రజాస్వామ్య పద్ధతులలో నిరంతరం పోరాటం చేసే ఐద్వా జాతీయ నాయకురాలు. పరువు హత్యలను ఓ జాతీయ సమస్యగా అంతర్జాతీయ సమాజం దృష్టికి తెచ్చి, "పరువు" పేరిట స్త్రీలపై జరిగే అన్యాయాలను, నేరాలను ఎదుర్కొంటున్న ధీశాలి.

ఢిల్లీలోని "షాదీకామ్ పూర్" ప్రాంతంలోని ఆమె ఆఫీసులో నేను కలిసిన రోజు కూతురు ప్రసవానంతర సమస్యలను ఎదుర్కొని తల్లిగా బాధ్యత నిర్వహించి, శలవానంతరం వచ్చిన దినం. "35 సంవత్సరాల క్రితం నా కూతురు పుట్టినప్పుడు ఎలాంటి సమస్యలను ఎదుర్కొన్నామో, ఇప్పుడూ అదే పరిస్థితి. వాస్తవ పరిస్థితుల్లో పెద్దగా మార్పేమి లేదు." అంటున్న ఆమె మాటల్లో మృదుత్వం, చేతల్లో ఓ స్పష్టత. ర్యాలీల్లో ఆమెతోపాటు పాల్గొనే వారు "పితృస్వామ్యం ఓ అబద్ధం. సమూలంగా ధ్వంసం చేయాల్సిన సమయం ఆసన్నమయిందంటూ " ఆమె చేసే నినాదాలు వింటే మృదువుగా విన్పించిన ఆమె గొంతులో యుద్ధభేరీలు మోగడమేమిటో ప్రత్యక్షంగా చూస్తారు.

**పరువు హత్యలు:** నిపుణుల అంచనా ప్రకారం, భారతదేశంలో ప్రతి సంవత్సరం కనీసం ఒక వెయ్యి (1000) పరువు హత్యలు జరుగుతున్నాయి. వీటిలో అధికశాతం జాతీయాభివృద్ధిలో మూడో స్థానంలోనున్న "హర్యానా" రాష్ట్రంలోనే.

క్రిసిల్ బృంద అధ్యయనం ప్రకారం, సభ్యురాలైన జగ్మతీ సంఘ్వాన్ పరిభాషలో దేశంలోని కొన్ని రాష్ట్రాల్లో మరికొన్ని కేంద్ర పాలిత ప్రాంతాలలో ఎక్కడయితే స్త్రీ, పురుష నిష్పత్తి 897:1000 గా ఉందో అలాంటి రాష్ట్రాల్లో హర్యానా కూడా ఉంది. సంప్రదాయాలను అత్యంత శ్రద్ధగా ఆచరించే రాష్ట్ర ప్రభుత్వ అధికారిక లెక్కల ప్రకారం స్త్రీలపట్ల రోజుకి 67 అత్యాచార కేసులు నమోదవుతున్నాయి.

దేశరాజధానికి శివారు ప్రాంతం, వ్యవసాయం ప్రధానమైన రాష్ట్రం,1970లో ప్రారంభమయిన "క్షీరవిప్లవం" లో 1998 కల్లా దేశంలో కెల్లా అత్యధిక పాలఉత్పత్తులో

అగ్రస్థానంలో ఉంది, 1960లో "గ్రీన్ విప్లవం" వలన సస్యశ్యామలమైన ప్రాంతం, ప్రస్థుతం రియల్ ఎస్టేట్ వ్యాపారానికి మూల కేంద్రమయింది.

హర్యానాలో అగ్రవర్ణం ఝూట్ కులస్తులు. జనాభాలో 24 శాతం ఉన్న ఈ సామాజిక వర్గం ఫ్యూడల్ భూస్వాములుగా ఖావ్ పంచాయితీలు నిర్వహించే 'కులపెద్దలు' గా కొనసాగుతున్నారు. తమ పంచాయతీల పెద్దలుగా వ్యవహరించే వీరు తమ కులస్థులకు "ఏంతినాలి? ఏం ధరించాలి? యవనస్థులు ఎవరిని వివాహం చేసుకోవాలి? మరీ ముఖ్యంగా మహిళలు ఎవరితో ఎలా ప్రవర్తించాలి? అన్న అంశాలలో దిశానిర్ధేశం చేస్తూ "కట్టుబాట్లు" చేస్తారు. వారి ఆదేశాలను ధిక్కరించిన వారి పట్ల క్రూరమైన శిక్షలు వేస్తారు.

"ఝూట్" ల తర్వాత అత్యధిక జనాభా "దళితులు". అనాదిగా అట్టడుగు స్థాయిలోనే ఉంచబడి నేటికీ అంటరాని వారుగా గుర్తింపబడుతున్న వ్యక్తులు. సామాజిక వర్గ నిచ్చెనలో అట్టడుగున నిలబడ్డ వర్గం. 2012 డిసెంబరు 10న ఢిల్లీలో "నిర్భయ" అత్యాచార సంఘటన జరిగింది. దానికి ముందు 17 సంవత్సరాల పూర్వం, 1995 లో హర్యానా రాష్ట్రంలోని జింద్ జిల్లాలోని సెషన్స్ కోర్టు ఇచ్చిన తీర్పును వ్యతిరేకిస్తూ, వెయ్యిమంది మహిళలు తమ నిరసన గళాలను తీవ్రస్థాయిలో విప్పారు. కారణం, 12 సంవత్సరాల బాలిక సామూహిక అత్యాచారానికి లోనయ్యి, న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తే, "సెక్స్-ఆమెకు అలవాటయిన చర్య" గానే, తీర్పునిస్తూ, ఆ బాలిక తప్పుడు కేసు బనాయించినట్లు న్యాయస్థానం తీర్పు చెప్పింది.

వాస్తవంగా జరిగిన సంఘటనను పరిశీలిస్తే అంతకు కొన్ని మాసాల ముందు ఆ బాలిక సోదరుడు, తమ కుల పంచాయతీ ఇచ్చిన తీర్పును ధిక్కరించి అదే గ్రామానికి అదే కులానికి చెందిన అమ్మాయిని వివాహమాడాడు. స్వగోత్రికులను వివాహమాడ కూడదన్న పంచాయతీ ఆజ్ఞను ఎదిరించిన కారణంగా, అతని సోదరిపై సామూహిక అత్యాచారాన్ని పంచాయతీ నిర్ణయించింది. "పితృస్వామ్య వ్యవస్థలో మహిళ ఓ వినియోగ వస్తువు. పంచాయతీ విధించిన కట్టు బాట్లను ధిక్కరించినా నిబంధనలను అతిక్రమించినా, తన వ్యక్తిత్వాన్ని నిలుపుకునే దిశలో స్వీయనిర్ణయాలు తీసుకున్నా, అది ఆమె స్వంత ఆలోచన కాదని భావిస్తారు. కుల, మత, కుటుంబ గౌరవాన్ని ఆమె/ ఆ మహిళ మంట గలిపిందని భావించి,

**హర్యానాలో అగ్రవర్ణం ఝూట్ కులస్తులు. జనాభాలో 24 శాతం ఉన్న ఈ సామాజిక వర్గం ఫ్యూడల్ భూస్వాములుగా ఖావ్ పంచాయితీలు నిర్వహించే 'కులపెద్దలు' గా కొనసాగుతున్నారు. తమ పంచాయతీల పెద్దలుగా వ్యవహరించే వీరు తమ కులస్థులకు "ఏంతినాలి? ఏం ధరించాలి? యవనస్థులు ఎవరిని వివాహం చేసుకోవాలి? మరీ ముఖ్యంగా మహిళలు ఎవరితో ఎలా ప్రవర్తించాలి? అన్న అంశాలలో దిశానిర్ధేశం చేస్తూ "కట్టుబాట్లు" చేస్తారు. వారి ఆదేశాలను ధిక్కరించిన వారి పట్ల క్రూరమైన శిక్షలు వేస్తారు.**

ఖాప్ పంచాయతీ తగిన శిక్షలను నిర్ణయించి క్రూరత్వంతో వ్యవహరిస్తారు. అంటారు. "జగ్మతీ"

తన 16 వ ఏట గ్రామంలో, కాలేజీ చదువు చదవాలను కుంటున్న యువతులందరిని సమీకరించి మొదటి పోరాటానికి నాంది పలికారు. "సంఘ్వాన్" కులపెద్దలను ఎదిరించి నిలిచిన తొలి సంఘటన. ఆ రోజు పంచాయతీ ముందు రెండు వర్గాలు బాలికలకు ఉన్నత విద్య అవసరం లేదని భావించే పురుషులు, స్త్రీలు, మరో వర్గం మాకు మద్దతినిస్తూ. ఊరు ఊరంతా అక్కడే వుంది. మా చదువుని వ్యతిరేకించే వర్గంలోని మహిళలకు, మాకు తమ మద్ధతునందివ్వాలని మనస్సులో ఉన్నప్పటికీ, ఇంటిలోనుండి తమ భర్తలు వెళ్లగొడతారేమోనన్న భయంతో ఆగిపోయారు.

ఆరోజు నాకర్థమైంది ఒక్కటే! బలహీనులు, దోపిడీకి, పీడనకు గురవుతూ, తమ హక్కుల సాధన కోసం పోరాటమే మార్గమని. ఆనాడు అనేక మంది మహిళలు పరిశీలించిన మరో అంశం. పోరాడే మనస్థత్వమున్న యువతుల పట్ల పంచాయతీ పెద్దల వైఖరీ, భర్తలుగా ఇళ్లల్లో తమ భార్యలపట్ల మగవారి ప్రవర్తనలో చాలా వ్యత్యాసముందని. నిజానికి ఆ రోజు పంచాయతీ మా వాదనను అంగీకరించలేదు. కానీ మా నిరసన మాత్రం మహిళల వాదనల పట్ల ఓ గుర్తింపునిచ్చింది. అది "ఆడతనం పట్ల అవగాహన".

హర్యానా రాష్ట్రంలోని సోనీపథ్ జిల్లాలోని "జంటా భూటాన్" గ్రామంలో ఎనిమిది మంది సంతానమున్న రైతు కుటుంబంలో జగ్మతి జన్మించింది. తన సోదరుల లాగానే, వారితోపాటు ప్రాథమిక విద్యాభ్యాసం చేసింది. ఆ పాఠశాలలో ఆడపిల్లలకు 'సైన్స్" నేర్పక పోవడాన్ని గమనించింది.

మగపిల్లలపట్ల వివక్ష లేకుండా సైన్స్ పాఠాలు నేర్పేవారు. 15 సంవత్సరాలు రాగానే ఆమె విద్యాభ్యాసం ఆగిపోయింది. ఎనిమిదవ తరగతి చదువుతున్న సమయంలో ఆమె సహాధ్యాయుని, మిత్రురాలు "తోటి మగపిల్లలతో ఎక్కువగా మాట్లాడుతుందని పరువు హత్యకు గురవ్వడం" మొట్టమొదటి సారిగా గమనించింది. ఆ మరణం ఆమెలో ఆలోచనకు అంకురం వేసింది.

హైస్కూల్ విద్యలో తమ చదువు ఆగిపోకూడదన్న కోర్కె ఉన్నా కుటుంబసభ్యుల అనుమతి లేక కళాశాల గుమ్మం ఎక్కాలన్న ఆలోచనలను బలవంతంగా అణచుకున్న ఆడపిల్లలను సమీకరించింది జగ్మతి. వారున్న గ్రామంలో కాలేజీ లేదు. 'గోహానా" లో కళాశాలలలో చేరాలంటే ఉదయం ఓ గంట సాయంత్రం ఓ గంట ప్రయాణం చేయాలన్న కారణంతో తల్లిదండ్రులు తమ ఆడపిల్లలను అనుమతించే వారు కాదు. అయినప్పటికీ జగ్మతి మరికొందరు యువతులు సాహసం చేశారు. బస్సెక్కిన సమయం నుండీ దిగే వరకూ రకరకాల వ్యాఖ్యానాలు, వ్యకిత్వాన్ని కించపరిచే వ్యక్తుల అల్లరి చిల్లరి వేషాలు భరించాల్సి వచ్చేది. కారణం పబ్లిక్ ప్రదేశాలలో మహిళల సంచారాన్ని భరించలేని మనస్తత్వం వలన. "తమను వేధిస్తున్న ఇద్దరు యువకులను, ఇద్దరు యువతులు చావాబాదుతున్న వీడియో ఈ మధ్య ఇంటర్‌నెట్‌లో విస్తృతంగా షేర్ చేయబడింది. ఆ రోజుల్లోనే మేము అలాగే తిరగబడి కొట్టేవాళ్లం.

కాకపోతే అందరం ఒక్కసారిగా గాక, రోజుకొకరు వంతులు వేసుకుని బాదేవాళ్లం. ఎందుకంటే మేము ప్రయాణం చేసే బస్సుల్లో కేవలం మేము మాత్రమే మహిళా ప్రయాణికులం. ఈవ్‌టీజింగ్‌ని అరికట్టడానికి ఆరోజుల్లో అదొక్కటే మార్గం. అంటూ గతాన్ని జ్ఞాపకం చేసుకుంటారామె!

చదువుకోవాలన్న కోరిక ఉన్నా, ఆర్థిక పరిస్థితి సహకరించని ఆడపిల్లలకు స్కాలర్‌షిప్ లభించడానికి ఒకే ఒక్క మార్గముండేది. అదే స్పోర్ట్స్ కళాశాలలో చేరడం. నాకు లాయర్ అవ్వాలన్న కోరికుండేది. కానీ స్కాలర్‌షిప్ లభించే పరిస్థితి కాదు. అందుకే, నాకున్న ఏకైక మార్గం స్పోర్ట్స్ కళాశాలలో చేరడం. అలా,నేను క్రీడాకారిణిని అయ్యాను. హర్యానాలో నాటీ నుండి నేటి వరకూ క్రీడా సంస్కృతి చాలా బలంగా ఉంది. అందువలనే 2010 లో కామన్ వెల్త్ పోటీలలో భారతదేశానికి 38 పతకాలు లభిస్తే అందులో 22 హర్యానా రాష్ట్రానికే!

"కాలేజీలో చేరాలనుకున్న ఆ రోజుల్లో శారీరక ధారుఢ్య పరీక్షలో పాల్గొన్న 25 మందిలో నేను మాత్రమే ఆడపిల్లను. మిగిలిన వాళ్లందరూ అబ్బాయిలే. అందుకే ఆ కాలేజీ ప్రిన్సిపాల్ నన్ను పిలిచి, ఆడపిల్లను కాబట్టి, అబ్బాయిల మధ్య ఇబ్బంది పడతానేమోనని చేరవద్దని సలహా ఇచ్చారు. కానీ నేను అంగీకరించలేదు. ఆరోజే నాకర్థమైంది. లింగవివక్షత అంటే ఏమిటి? ఆడపిల్లలపై సమాజం ఏ విధంగా కాపలా కాస్తుందో? నేను కాలేజీలో చేరిన తర్వాత ట్రైనింగ్‌లో ఓ కోచ్‌నన్ను పిలిచి "ఎవ్వరి అనుమతితో నువ్వు అబ్బాయిలతో మాట్లాడుతున్నావని? ప్రశ్నించాడు. నిజానికి ఆయన నానుండి ఆశించింది. ఆయన ప్రశ్నకు నేను సిగ్గుపడతానని, తప్పు చేశానన్న అపరాధ భావం నాలో కనబడుతుందని, కానీ ఆయన ఆలోచనకు భిన్నంగా, నాతోటి క్రీడాకారుడితో మాట్లాడటానికి ఎవ్వరి అనుమతి అవసరం లేదని జవాబిచ్చాను. ఊహించని ఆ సమాధానానికి ఆ శిక్షకుడు కోపంలో "ఓ నాయకు రాలవ్వాలనుకోకు?" అన్నారు.

ఆ తర్వాత ట్రైనింగ్ క్యాంప్‌లోని బృందం నుండి నా పేరు తొలగించబడింది. ఆ సంఘటన తర్వాత చాలా సంవత్స రాలు ఓ పొగరుబోతుగా కాలేజీలో ఆమె ముద్రవేయబడింది. క్రీడాకారులు నిక్కర్లు వేసుకోవడం, టీషర్టులు వేసుకోవడం అత్యంత సహజ విషయం. అయితే క్రీడాకారిణీలు కురచగా ఉండే నిక్కర్లు శరీరానికి అతుక్కు ఉండే టీషర్టులు ధరించడం చాలా వింతగా సమాజం చూసేది. ఆటలకు అవసరమైన దుస్తులు ధరించామన్న భావంతో కాక, అనవసర ప్రాధాన్యత మా బట్టలకిచ్చేవారు. "మా శరీరాల పట్ల, మేము క్రీడలకోసం ధరించిన దుస్తుల పట్ల ఎలాంటి వ్యాఖ్యానాలు చేసేవారంటే, ఎంతో మంది తల్లిదండ్రులు తమ ఆడపిల్లలను టీమ్‌నుండే తీసుకెళ్లి పోయేవారు. తల్లిదండ్రుల నిర్బంధం వలన, వివాహం చేసుకుని అత్తగారిళ్లకు వెళ్లిపోవడం వలన మా టీమ్ ఎప్పటికప్పుడు విచ్ఛిన్న మవుతూనే వుండేది. అయినా సరే. క్రొత్తవారిని తయారు చేసుకుంటూ, సరిక్రొత్త క్రీడాకారుణలతో కలిసి జగ్మతి సంఘ్వాన్ మాత్రం తన కెరియర్‌ను కొనసాగిస్తూ అంతర్జాతీయ స్థాయి కెదిగింది. తన బృందంలో వివాహం చేసుకుని వెళ్లిపోయిన అమ్మాయిలు మాత్రం అర్ధాంగి పాత్ర పోషిస్తూ కుటుంబాలకే అంకితమై పోయారు. "వాళ్లను ఇప్పుడు

చూడాలి. ఆ రోజుల్లో ఎలాంటి శారీరక విన్యాసాలయినా చేసి, ఎంత ఎత్తుకయినా ఎగిరేవారు, ప్రస్తుతం ఇంటి గుమ్మం గడపదాటి బయటకే రావడం లేదు" అంటారామె.

**ఆకాశమే హద్దు:** విద్యార్థులు వసతి గృహాల్లో వుంటున్న యువతీయువకులపై ఎన్నెన్నో ఆంక్షలు విధిస్తున్న మేనేజీమెంట్‌కి వ్యతిరేకంగా,ధర్నాచేస్తున్న సమయంలో ఎస్ఎఫ్ఐ నాయకుడు "ఇందర్ జిత్"ని తొలిసారిగా కలిసింది జగ్మతి సంఘ్వాన్. సిద్ధాంత సారూప్యత కలిసిన ఆనాయకులిద్దరు, తర్వాత జీవిత భాగస్వాములయ్యారు. "క్రీడాకారిణిగా నేను సాధించిన విజయాలను ఎంతో గర్వంగా భావించిన నా కుటుంబం, నా భర్తను నేనే ఎంచుకోవడం సహించలేక పోయింది. కుటుంబ నియమాలను, కుల నిబంధలను నేను అతిక్రమించినట్లుగా భావించారు.

శారీరక హింసకు సైతం నేను లోనయ్యాను. "గత రెండు దశాబ్దాలలో, కుల పంచాయతీలు, స్వీయ నిర్ణయంతో వివాహమాడే యువతీ యువకులను చెట్టుకు కట్టివేసి కొట్టడం, ట్రాక్టర్‌తో త్రొక్కించడం, ముక్కలు ముక్కలుగా నరికి, వ్యవసాయానికి నీళ్లు వదిలే కాలవలలో పడవేయడం, పబ్లిక్‌గా వధించడం చాలా సహజమైపోయాయి.

2004 సంవత్సరం ఢిల్లీ సరిహద్దులోనున్న 'భల్లభగర్" ప్రాంతంలో, కుల పంచాయతీ ఓ తీర్మానం చేసింది. అదేమిటంటే "ఆస్థుల పంపకాలలో తీర్పు కోసం వచ్చే కుటుంబాలలో ఇద్దరి కన్నా తక్కువ మగపిల్లలుంటే రావద్దని, మగ సంతానం తక్కువున్న కుటుంబాలు దురదృష్టవంతమైన అదృష్టహీన కుటుంబాలని. తత్ఫలితంగా 2004 సంవత్సరంలో 1000 మంది పురుషులకు 683 మంది మహిళలున్న స్త్రీ పురుష నిష్పత్తి, దారుణంగా పడిపోయి, 2008 కల్లా 1000 మంది పురుషులకు 370 మహిళలుగా దిగజారిపోయింది.

ఇలాంటి నేపథ్యం, సామాజిక పరిస్థితులున్న సమాజంలో ఆడవాళ్లు ఇంటి గుమ్మం దాటలేని పరిస్థితులలో మహిళలను సంఘటిత పరచడం, ఉద్యమాలు నిర్వహించడం అంటే చాలా క్లిష్టమైన విషయం. 'కొండకు వెంట్రుక వేసి లాగడం" అనే ప్రయత్నాన్ని జగ్మతీ సంఘ్వాన్ చేపట్టారు.

"మొట్టమొదటగా ప్రభుత్వం చేపట్టిన అక్షరాస్యత కార్యక్రమాన్ని చేపట్టాం. ఆ విధంగా మహిళలకు చేరువయ్యాము. అన్నిటికన్నా ముఖ్యంగా సాంస్కృతిక రంగం ఎంతగానో దోహదం చేసింది. మహిళలు జానపద కార్యక్రమాలలో పాల్గొనడం పట్ల పురుషులలో వ్యతిరేకత అంతగా లేదు. మహిళలను సంఘటిత పరచడానికి ఐకమత్యంగా ఒక వేదికపై తీసుకరావడానికి ఈ ఉద్యమం మాకు సహకరించింది. అంతేగాక మా పట్ల ఎవ్వరికి అనుమానం రాలేదు. మహిళల హక్కుల పట్ల, పోరాటాల పట్ల ఓ అవగాహన తీసుకురావడానికి సాంస్కృతిక రంగం ఎంతగానో తోడ్పడింది.

"జనవాది మహిళా సమితి" స్థాపించి ఓ దశాబ్ద కాలం శ్రమించిన తర్వాత 40 వేల మంది సభ్యులతో సంస్థ ఎదగడం కులపంచాయతీ పెద్దలకు కంటగింపు అయ్యింది. ఫలితంగా, ఎన్నో సందర్భాలలో సమితి సభ్యులను పబ్లిక్‌గా అందరి ముందూ అవమానించడం, భర్తలు అర్థరాత్రులు తమ భార్యలను నగ్నంగా రోడ్ల మీదకు వెళ్లగొట్టడం చేసేవారు. తన మాట వినకుండా సభలకు వెళుతున్న భార్య వైఖరి భరించలేని ఓ భర్త ఆత్మహత్య సైతం చేసుకున్నాడు. ఇలాంటి సంఘటనలు, ఉద్యమంపై ఓ మచ్చగా మిగులుతూనే ఉంటాయి. వాటిని తుడుచుకుంటూ నమ్మిన లక్ష్యంవైపు పయనం చేయడమే ఎవ్వరైనా అనుసరించాల్సిన మార్గం" అంటారు జగ్మతి.

కుల పంచాయతీల ప్రభావం, రాజకీయ పార్టీలపై సైతం చాలా ఉంటుంది. కుల ఓటు బ్యాంకులకు మూలధారంగా ఈ పంచాయితీలుంటాయి. అందుకే చాలా సందర్భాలలో తప్పు చేసిన వారు సైతం శిక్ష తప్పించుకోగలుగుతున్నారు. ఈ మధ్య కాలంలో "ఝూట్" కులేతర వ్యక్తి, హర్యానా రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. ఎన్నికల ప్రచారం సందర్భంగా, కుల పంచాయతీలపై ఆయన అభిప్రాయాన్ని సేకరిస్తూ ప్రశ్నించగా, "ఆడవాళ్లు, మగవాళ్లను ఊరించే దుస్తులు వేసుకోవడం, ఆకర్షించే దిశగా వస్త్రధారణ చేయకుండా, హుందాగా బట్టలు వేసుకోవాలని సమాధానమిచ్చారు".

మధ్యయుగం నాటి హేయమైన, క్రూరమైన శిక్షలు ఖాప్ పంచాయతీలు విధించడం వెనుక అనాగరికమైన మనస్తత్వమున్న బృందం ఉంది. వీటి మూలాలను పరిశీలిస్తే, సమాజాన్ని శాసించాలన్న ఆలోచన కన్నా, ఆర్థిక కారణాలే అధికం. అందుకే ఎవ్వరూ వాటిని ఎదురించడంలేదు.

1988లో ఆనాటి హర్యానా ముఖ్యమంత్రి, భారతదేశ ఉప ప్రధాన మంత్రిగా వ్యవహరించిన "దేవిలాల్" హిందూ

వారసత్వ చట్టంలో ఓ దిద్దుబాటును ప్రతిపాదించారు. అదేమిటంటే " వివాహమై అత్తారింటికి వెళ్లిపోయిన ఆడపిల్లలెవ్వరూ, తమ పూర్వీకుల ఆస్థిలో వాటా అడగరాదని!! దేశవ్యాప్తంగా మేధావులు, స్త్రీవాదులు ,మహిళాభ్యుదయం కోరిన ప్రతివారూ తమ నిరసన వ్యక్తం చేశారు. జగ్మతి సంఘ్వాన్ సైతం చాలా పెద్దపోరాటం జరిపారు. దేవీలాల్ చేసిన ప్రతిపాదన వెనుకనున్నది "భూమి". పూర్వీకుల ఆస్థిలో స్త్రీలకు వాటా ఉండకూదనడం వలన, కులాంతర, మతాంతర వివాహాలు చేసుకున్న ఆడపిల్లల వాటాను, ఆ కుటుంబానికే మిగిల్చి వేయడం. అంటే భూమి మీద హక్కును కోల్పోతూ ఆర్థికంగా వెనుకబాటుతనానికి గురిచేయడం.

జాతీయ మహిళా కమీషన్ నివేదిక ప్రకారం, కులాంతర వివాహాలు చేసుకున్న 72 శాతం మహిళలు."పరువు హత్యలకు "గురవుతున్నారు.

2014 సంవత్సరంలో ఏప్రియల్ నెలలో హిసార్ జిల్లాలోని 'భగానా' గ్రామానికి చెందిన నలుగురు దళిత యువతులు 'ఝాట్" సామాజిక వర్గ సభ్యులచే గ్యాంగ్ రేప్‌కి గురయ్యారు. 'ఝాట్" ల వ్యవసాయ క్షేత్రాలలో పనిచేస్తూ ప్రభుత్వం నుండి తమకు రావాల్సిన భూమికోసం పోరాటం చేస్తున్న దళితులకు గుణపాఠం చెప్పడానికే ఈ అత్యాచారం చేసినట్లు నిర్భయంగా ప్రకటించారు. చాలాసందర్భాలలో, తమపై జరిగిన అత్యాచారాలపై దళితులు కేసులు పెట్టకుండా, పెట్టినా తర్వాత అర్థంతరంగా తమ కేసులను ఉపసంహరించుకొంటారు. ఎందుకంటే ఝాట్‌ల వ్యవసాయ క్షేత్రాలలో ఉపాధిని కోల్పోతామన్న భయంతో. జగ్మతీ సంఘ్వాన్ తనకుతానే సిద్ధాంత కర్తగా భావించ లేదు. కానీ కుల, మత, వర్గ విభజన పరస్పరం బలపరుచు కుంటాయని విశ్వసిస్తారు. "నిర్భయ" సంఘటన తర్వాత దేశవ్యాప్తంగా మహిళలపై అణచివేత, హింస గూర్చి పెద్ద చర్చ, పోరాటం నడిచాయి.

"ఎవ్వరైనా అర్థం చేసుకోవాల్సింది, పోరాటం చేయాల్సింది క్షేత్రస్థాయిలోని, సమస్య మూలాల పట్ల, పితృస్వామ్య వ్యవస్థ లక్షణాల పట్ల నిరంతర యుద్ధం జరగాలి అంటారు జగ్మతి. అంతేకాదు. "కుల, మత వర్గ, లింగ భేదాలపై అసమానతలపై పోరాటం సంఘటితంగా చేస్తేనే ఫలితం" ఉంటుందని విశ్వసిస్తారు.

దేశవ్యాప్తంగా "ఆహార-భద్రత" చట్టం ప్రకారం దేశంలోని ప్రతిపౌరుడికి ఆహారం సమకూర్చడం, భూ ఆర్డినెన్స్ చట్టము రైతుల అవసరాలకు అనుగుణంగా ఏర్పడడమే గదా! ఈ రెండు చట్టాలు రావడంలో మహిళల పాత్ర, ఉద్యమం లేవా? అంటూ ప్రశ్నిస్తారామె.

నాకు బాగా గుర్తు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన అనేక మంది మహిళలు, మాకుటుంబంలో సైతం మా అమ్మమ్మ, నాన్నమ్మ, అత్తలు,పిన్నమ్మలు, ఎందరో నడుం విరిగేటట్లు పొలాల్లో పనిచేసేవారు. సరైన పోషకాహారం లేక తక్కువ కాలం జీవించారు. మనం బ్రతికుంటేనే గదా, స్వాతంత్ర్యం కోసం, సమానత్వం కోసం పోరాడగలం.

ఇలాంటి వాదనలతో ఉద్యమాలలో మమేకమైన జగ్మతి సంఘ్వాన్‌ని పోలీసుల లాఠీలు ఎన్నోసార్లు తాకాయి. నీళ్ల క్యాన్‌లు ఎగిసిపడ్డాయి. సమ్మెచేసే కార్మికులకు సంఘీభావాన్ని ప్రకటించడం మతోన్మాదులకు వ్యతిరేకంగా, కులపంచాయతీల పేరుతో జరిగే హింసకు వ్యతిరేకంగా తిరగబడటం వలన "అరెస్టు" అవ్వడం జగ్మతి జీవితంలో చాలా సహజమైపోయింది.

నిత్య పోరాటాలలో, జీవితాన్ని సాగిస్తున్న 55 సంవత్సరాల జగ్మతి సంఘ్వాన్ ప్రస్థుతం పరువు హత్య లకు వ్యతిరేకంగా బిల్లు తీసుకురావడానికి పెద్ద ఎత్తున ప్రచారం నిర్వహిస్తూ బిజీగా ఉన్నారు. దేశంలోని 27రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు ఈ ప్రతిపాదనకు తమ మద్ధతు తెలిపాయి. కులాంతర , మతాంతర వివాహాలు చేసుకునే జంటలకు, స్వగోత్రికులను, స్వగ్రామంలో పెళ్లి చేసుకునే యువతీ యువకులకు వారి కుటుంబాలకు జరిమానా విధించకుండా చర్యలు తీసుకోవాలని జగ్మతి కోరుతున్నారు. కానీ, ఈ అంశంపై అన్ని రాజకీయ పార్టీలతో సంప్రదింపులు జరిపి, ఏకాభిప్రాయానికి వచ్చే వరకూ చట్టబద్ధత ఇవ్వడానికి ప్రభుత్వం సిద్ధంగా లేదు. ఈ బిల్లు తీసుకురావడానికి చేస్తున్న కృషి, పురోగతి ఆశావహంగా ఉంది. కానీ అమలులోకి రావాలంటే చేరాల్సిన గమ్యానికి వెళ్లాల్సిన దూరం మాత్రం ఎంతో ఉంది. "సమాజంలో ఏ మార్పు కావాలన్నా, శ్రీకారం చుట్టాలన్నా, ముందు నడవాల్సింది మహిళలే" నంటారు జగ్మతీ సంఘ్వాన్ అంతేకాక "చంద్రుడ్ని మాకోసం తేకండి మేమే చంద్రుడ్ని చేరడానికి తోడ్పాటు ఇవ్వండి" అంటారామె. ఎంత ఉత్తేజకర సందేశం???

**అనువాదం: డా.దుట్టా శమంతక మణి**

కథ

# విలువైన బహుమతి

- డా. ఎం. ప్రగతి

"ఏందిరా బూ తినకుండా అంతగా చింత జేస్తండావ్?" తల్లి మాటలతో ఈ లోకంలోకొచ్చాడు రవి. "ప్రభాకరం సారు తరగతి గదిలో తల్లి గురించి ఎంత బాగా సెప్పినాడు. నిజమే, అమ్మ ఎంతెంత పంజేస్తాది ఇంటా, బయటా. అయినా ఇదేం లోకం, ఆడోల్లు మటుకే ఇంటి పంజేయాలని ఎవురు తీర్మానం జేసినారో? ప్రభాకరం సారు సెప్పినట్లు ఏమన్నగానీ, నేంగూడా ఇయ్యాలబట్టి అమ్మకు పన్లో సాయం జెయ్యాల." ఖచ్చితంగా నిర్ణయించుకున్నాడు. అన్నం తినడం పూర్తి కాగానే పళ్ళెం చుట్టూ పడిన మెతుకులను జాగ్రత్తగా ఎత్తి, చేయి కడుక్కుని పళ్ళెం ఎత్తి లేచి నిలబడ్డాడు. పనిలో వున్న తల్లి ఈ సంగతి గమనించలేదు గానీ, బయటనుంచి లోపలికొస్తున్న రవి నాయనమ్మ అది చూసి గట్టిగా అరచింది. "తట్ట నువ్వెత్తు తాండవేందిరా? మీయమ్మ యాడకు బోయినాది?" రవి మీద కేకలేసింది. "అమ్మ లోపలేదో పన్లో వుంది లేవ్వా. నా తట్ట నేనే కడుగుతాలే". మనవడి మాటలతో శివాలెత్తి పోయింది ముసలమ్మ. "ఏంరా ఇంట్లో ఆడోల్లు లేరా నువ్వు ఆడంగి పనులు సెయ్యడానికి. గమ్మున సెయ్యి కడుక్కుని తట్ట ఆడేసి పో. అవ్వ మాటలు రవి పట్టించుకోకుండా," అది కాదవ్వా, మా బల్లో సారు అందరూ అన్ని పనులు చేసుకోవాలని సెప్పినాడు. ఆడోల్ల పని, మొగోల్ల పని అనే తేడాలు మనం పెట్టుకున్నయేనని కూడా ఇడమరసి సెప్పినాడు." అని సర్ది చెప్పబోయాడు. "ఎవుర్రా ఆసారు, మా బాగా సెప్పినాడే. మీ బల్లో ఇట్టాంటివి గూడ నేర్పిత్తారా? సెప్తే సెప్పినాడు." అయ్యన్నీ ఈడ కుదరవు". ఎప్పుడొచ్చిందో లోపల్నుంచి వచ్చిన తల్లి రవి చేతిలో నుంచి పళ్ళెం లాక్కుంటూ అన్నది. ఆ తర్వాత కూడా ఎప్పుడూ ఇంటి పనిలో జోక్యం చేసుకోబోయినా, తల్లికి సాయం చేయబోయినా ఇంట్లో ఏ ఒక్కరూ పడనీలేదు.

"ఆడంగెదవా, ఎన్ని సార్తు సెప్పాల్రా నీకూ ఇట్టాంటి పనులు సేయొద్దని".

"ఇది ఆడోల్ల పని, నువ్వు నీపని సూసుకో పో".

"మొగోల్లెవురన్నా ఇట్లా పొరకు సేతబట్టి కసువు నూకుతారా?"

ఇలా అందరూ అడుగడుగున రవిని ఇంటిపని చేయనీకుండా అడ్డుపడ్డారు. కానీ ప్రభాకరం మాస్టారు చెప్పిన మాటల్లో వాస్తవాలు ఏడవ తరగతి చదువుతున్న రవి మనసులో బలంగా నాటుకుపోయాయి. ఇంటిపని, వంటపని ఆడవాళ్ళ పని మాత్రమే కాదని, ఎవరైనా చేయవచ్చుని మనస్ఫూర్తిగా నమ్మాడు.

పద్నాలుగేళ్ళు గడిచాయి. రవి చదువులో బాగా రాణించాడు. ఇంజనీరింగు పూర్తి చేసి బెంగుళూరులో సాఫ్ట్వేర్ ఇంజనీరుగా ఓ ప్రయివేటు కంపెనీలో పనిచేస్తున్నాడు. అదే రంగంలో పనిచేస్తున్న దివ్యతో అతని పెళ్ళయింది. పెళ్ళయిన తొలి రోజుల్లో దివ్యకు ఇంటిపనిలో, వంటపనిలో సాయం చెయ్యాలని ఉబలాటపడ్డాడు. కానీ దివ్య "మీరలా హాల్లో కూర్చోండి. నేను చిటికెలో పని పూర్తి చేసేస్తాను. ఎవరైనా చూస్తే నేనేదో మిమ్మల్ని ఇంటిపని చేయిస్తున్నాననుకుంటారు." ఇలా దివ్య కూడా రవిని పని చేయనివ్వలేదు. ఓరోజు దివ్యకంటే ముందుగా ఆఫీసు నుండి ఇంటికొచ్చిన రవి కాఫీ తయారు చేసి భార్యను ఆశ్చర్యపరచాలనుకున్నాడు. అలసిపోయి ఇంటికొచ్చి సోఫాలో కూలబడిన దివ్వతో, "దివ్యా, కాఫీ!" అంటూ సంబరంగా చేతికిచ్చాడు. దివ్య నొసలు చిట్లించి, "మిమ్మల్నెవరు కాఫీ కలపమన్నారు?" అంటూనే ఒక్కసారి సిప్ చేసి, "అబ్బ, ఇది కాఫీనా, లేకపోతే షుగర్ ఫ్యాక్టరీనా? ఇంత చక్కర వేస్తే ఎలా తాగేది?" అంటూ సింక్‌లో పారబోస్తూ వంటింటి గట్టుకేసి చూసింది. "ఏమిటీ గిన్నె ఇలా మాడ్చేశారు? ఈ పాలు ఒలికిపోయాయెందుకు? బాబోయ్! ఇదంతా నేనిప్పుడు శుభ్రం చేసుకోవాలా? ఇదిగో ఇప్పుడే చెబుతున్నా, మీరు ఇంకెప్పుడూ ఇలాంటి ప్రయోగాలు చేసి, నా దుంప తెంచొద్దు. నా తిప్పలేవో నేనే పడతాను." అది మొదలు మళ్ళీ రవి వంట పనిలో గానీ, ఇంటిపనిలో గానీ తలదూర్చే ధైర్యం చెయ్యలేదు.

కాలచక్రం గిర్రున తిరిగింది. రవి, దివ్యలకిప్పుడు ఐదేళ్ళ

బాబు స్వరాజ్. ఓ వైపు ఆఫీసు పని, మరోవైపు ఇంటిచాకిరీతో దివ్య సతమతమవుతూనే, ఒంటరిగా అవస్థ పడుతోంది. మహానగరాల్లో పనిమనుషులకూ కరువే. అందునా వీళ్ళ టైమింగ్సుకు ఏ పనిమనిషీ దొరకడం లేదు. అమ్మ అవస్థ చూసిన స్వరాజ్, "అమ్మా, నేను హెల్ప్ చేయానా?" ముద్దుముద్దుగా అడిగాడో రోజు. "వొద్దులే నాన్నా, నువ్వింకా చిన్న పిల్లాడివి కదా, చేయలేవు. నేనే చేసుకుంటాలే!" దివ్య మాటలతో స్వరాజ్ రవి దగ్గరికెళ్ళి, "నాన్నా, నువ్వు పెద్దవాడివే కదా, అమ్మకు నువ్వు సాయం చేయొచ్చు కదా? పాపం అమ్మ ఎంత అవస్త పడుతుందో చూడు". అమ్మపై సానుభూతి చూపించాడు. "నిజమేరా నాన్నా, నాక్కూడా మీ అమ్మ మీద జాలి, ప్రేమ అన్నీ వున్నాయి. కానీ మీ అమ్మకు నేను చేసే పని నచ్చదు. ఏం చెయ్యను చెప్పు?" అంతకంటే ఎలా చెప్పాలో తోచలేదు రవికి. "ఓహో, అమ్మ పుట్టేటపుడే అన్ని పనులు నేర్చుకొని పుట్టిందేమో!" పైకే అనేశాడు స్వరాజ్.

"రవీ! మా స్నేహితురాలు స్వాతి వచ్చే ఆదివారం మనల్ని వాళ్ళింటికి భోజనానికి ఆహ్వానించింది. మనం తప్పకుండా వెళ్ళాలి." పని పూర్తి చేసుకొచ్చి చేతులు తుడుచుకుంటూ చెప్పింది దివ్య. "అలాగేలే, అడ్రసెక్కడో కనుక్కో!" రవి టీవీలో చానల్ మారుస్తూ అడిగాడు.

– – –

ఆదివారం మధ్యాహ్నం పన్నెండింటికి స్వాతి వాళ్ళ ఇల్లు చేరారు దివ్య, రవి, స్వరాజ్. కాలింగ్ బెల్ నొక్కి వారగా నిలబడ్డారు. తలుపు తీసిన మగమనిషి చేతిలో అట్లకాడతో ప్రత్యక్షమయ్యేసరికి ముగ్గురూ ఆశ్చర్యపోయారు. "దివ్యా వాళ్ళు వచ్చేశారా రఘూ?" వంటింట్లో నుంచి భర్తను కేకేసింది స్వాతి. ఆమె భర్త రఘు హాల్లో అతిధులను కూర్చోబెట్టి లోపలికెళ్ళాడు. హాల్లో నుంచే వంటగది అంతా కనబడుతోంది. స్వాతి చపాతీలు రుద్దుతుంటే రఘు పెనంపై కాలుస్తున్నాడు. రవికి ఆ దృశ్యం అపురూపంగా తోచింది. "ఒక్క నిమిషం దివ్యా, వచ్చేస్తున్నా." అంటూ రఘుతో "ఈ రెండు చపాతీలు కాల్చి, రైతా కోసం ఉల్లిపాయలు కట్ చేయ్ రఘూ, నేను స్నానం చేసొస్తా!" అని దివ్య దగ్గరికొచ్చి కుశల ప్రశ్నలు వేసింది.

"లోపలి కెళ్దాం రా దివ్యా!" అంటూ బెడ్ రూమ్ లోకి తీసుకెళ్ళింది. "మీ ఆయనతో బాగానే పని చేయిస్తున్నావే?" దివ్య ప్రశ్నకు సమాధానంగా స్వాతి, "మేమిద్దరం కలిసే పని చేసుకుంటాము. ఏం మీ ఆయన నీకు సాయం చెయ్యడా? ప్రశ్నించింది దివ్యను. "ఐ వోంట్ లెట్ హిమ్ ఇంటు మై ఎంపైర్!" గర్వంగా చెప్పింది దివ్య. "తొక్కలో ఎంపైర్! నీ వంటిల్లొక సామ్రాజ్యం. దానికి నువ్వొక సామ్రాజ్ఞివి. ఇలా మనం అనుకోబట్టే అవతల మగమహారాజులు ఎంజాయ్ చేసేస్తున్నారు. మనమేమో ఇంటిపని, వంటపని, పిల్లల చదువులు అన్నిట్లో అలసిపోయి మనకంటూ టైం లేకుండా చేసుకుంటున్నాము. మన ఆఫీసు పనుల్లో కూడా నైపుణ్యాలను మెరుగు పరచుకోలేకపోతున్నాము". స్వాతి దివ్య మైండ్ సెట్ మార్చే పనిలో పడింది. "అదికాదే, మా ఆయన పని చేస్తే ఇల్లంతా గందరగోళమయిపోయి నా పని రెట్టింపవుతుంది." కాస్త తగ్గి వివరణ ఇచ్చుకుంటోంది దివ్య.

వీళ్ళ సంభాషణ ఇలా వుంటే అవతల మగవాళ్ళ సంభాషణ కూడా ఇదే అంశం మీద జరుగుతోంది. "మీ వైఫ్ కు మీరు బాగా సాయం చేస్తున్నారు రఘు గారూ, ఇంటి పనులు కూడా చక్కగా చేస్తున్నారు.." మెచ్చుకోలు గా అన్నాడు రవి. "నేనెప్పుడన్నా పనిలో జోక్యం చేసుకోబోతే సరిగ్గా చేయనని మా ఆవిడ విసుక్కుంటుంది." పనిలో తన వైపునుంచి సంజాయిషీ కూడా ఇచ్చుకున్నాడు. "నాక్కూడా మొదట్లో ఏ పనీ వచ్చేది కాదు రవి గారూ, కూరల్లో ఉప్పూకారం ఎక్కువో తక్కువో అయ్యేవి. లేదంటే మాడిపోయేవి. అయినా తనేమీ మాట్లాడకుండా తినేసేది. విసుక్కోకుండా నాకన్ని పనులు నేర్పించింది. ఇప్పుడు ఇద్దరం కలసి పని చేసుకుంటూ ఉన్నందువల్ల ఇద్దరి మధ్యా సాన్నిహిత్యమూ పెరుగుతుంది, పని భారమూ తెలియదు. చాలామంది ఆడవాళ్ళు తమ భర్తలు ఖరీదైన నగలో, చీరలో బహుమతులుగా ఇవ్వాలనుకుంటుంటారు అమాయకంగా, కానీ పనిలో సాయం అనేది అన్నిటికన్నా గొప్ప బహుమతి. నా శ్రీమతి ఈ అమూల్యమైన బహుమతే కావాలంటుంది" హాల్లోకి వచ్చిన దివ్య రఘు మాటలు వింటూ నిలబడిపోయింది. "అమ్మా! నువ్వు కూడా నాన్నకు పని నేర్పించొచ్చు కదా?" స్వరాజ్ అమ్మ కొంగు లాగుతూ అన్నాడు. రవికి స్వరాజ్‌లో ప్రభాకరం మాస్టారు కనిపించారు.

వ్యాసం

# ఆత్మహత్యలు- అనర్థాలు

- మందరపు హైమావతి

ఇటీవల గుంటూరు జిల్లాలో ఒక ఫార్మసీ కాలేజీ విద్యార్థిని సుమలత ఆత్మహత్య చేసికొందన్న వార్త చదివి నా మనసంతా చేదు తిన్నట్లుగా అయిపోయింది. పంటలు పండక, అప్పులు తీర్చలేక రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం కొత్తేమీకాదు. కానీ ఈ మధ్య అనేక కారణాల వలన విద్యార్థుల ఆత్మహత్యలు ఎక్కువైపోయాయి. ఈ సంఘటనలో కళాశాల సిబ్బంది వేధింపుల వల్లే హాస్టల్ విద్యార్థిని సుమలత ఆత్మహత్య చేసికొందని తోటి విద్యార్థులు తెల్పారు. సిబ్బంది పెట్టే ఒత్తిడిని భరించలేకే వాళ్ళ చెల్లెలు బలవన్మరణం పొందిందని సుమలత అన్నయ్య అన్నాడు. బాగా చదువుకొని పరీక్షలలో ఉత్తీర్ణత పొంది, భవిష్యత్తులో మంచి ఉద్యోగాలు చేసికొంటూ జీవితంలో ఎంతో ముందుకు వెళ్ళాల్సిన విద్యార్థులు ఇలా బలవన్మరణాలకు పాల్పడడం ఆలోచించ దగిన విషయం. ఒకప్పటి చదువులకి,ఇప్పటి చదువులకి చాలా తేడావుంది. ఇప్పుడు విద్యార్థుల తలలపై అనేక రకాల ఒత్తిళ్ళ కత్తులు వేలాడుతున్నాయి. ఇరవై ఏళ్ళ కిందవరకు విద్యార్థులు ఆడుతూ పాడుతూ చదువుకొనేవారు. వారిపై ఏ ఒత్తిడీ వుండేది కాదు.

ఇప్పుడు ఆంగ్ల మాధ్యమం చదువులు వచ్చాక పాఠశాల స్థాయి నుండే పిల్లలపై ఒత్తిడి మొదలవుతుంది. ఫస్ట్ ర్యాంకుల కోసం పోరాటాలు, గ్రేడ్‌లకోసం ఆరాటాలు. ఆరవ తరగతిలో మొదలైన పోరాటం పదవ తరగతిలో పరాకాష్టకు చేరుతుంది. పదవ తరగతికి రావడం ఆలస్యం పొద్దున్ననుంచి సాయంత్రం వరకు "చదవండి చదవండి" అని విద్యార్థుల ప్రాణం తీస్తారు టీచర్లు. ఇప్పుడు ప్రభుత్వ పాఠశాలల్లో కూడ ఈ చదువులపోటీ మొదలయింది. పొద్దుటి నుంచి రాత్రి వరకు విసుగు, విరామం లేకుండా చదివిస్తూనే వుంటారు. ఇప్పుడు కార్పోరేట్ విద్యాసంస్థలతో పాటు ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులపై కూడా ఒత్తిడి పెరిగింది. అధికారులు ఉత్తీర్ణతలో వందశాతం సాధించాలంటారు. ఇక టీచర్లు పిల్లల్ని తీరిక లేకుండా రుద్దుతుంటారు.

ఆటల ఆటవిడుపులుండవు, పాటల పరిమళాలుండవు. ఎప్పుడు చూసినా చదువు మంత్రాన్నే జపిస్తుంటారు. సృజనాత్మకత లోపించి బట్టీలు పడుతుంటారు. కార్పోరేట్ పాఠశాలల్లో విద్యార్థులు సొంతంగా ఆలోచించడానికి అవకాశం ఇవ్వరు. ఉపాధ్యాయులే ప్రశ్నలకు జవాబులు తయారు చేసి ప్రింటుచేసి ఆ జవాబులను విద్యార్థులకిస్తారు. ఒలిచిన అరటిపండును ఆస్వాదించడమే వారిపని. అందుకే పరీక్షల్లో 100కి 100 మార్కులు వచ్చినా, చాలామందికి మాతృభాషలో కానీ ఆంగ్లంలో గానీ పట్టు, ప్రావీణ్యం వుండడంలేదు. చదువుల్లో నైపుణ్యం లేకపోతే పోయింది ఆత్మస్థైర్యం కూడా వుండడంలేదు. అందుకే నాలుగు మార్కులు తక్కువ వస్తే ధైర్యం లేకుండా బెంబేలు పడి ఆత్మహత్యలు చేసికొంటున్నారు. ఎవరైనా నాలుగు మాటలన్నా, బెదిరించినా ఎదిరించి సమాధానం చెప్పాలి గానీ కుంగిపోయి ప్రాణాలు తీసికోవడం ఎంతవరకు సబబు?

ఆత్మస్థైర్యాన్ని పెంచాల్సిన చదువు ఈనాడు ఆ అర్థాన్ని కోల్పోయింది. చదువంటే కేవలం మార్కులు, ర్యాంకులుగా మిగిలిపోయింది. అసలు బాగా చదివేవాళ్ళకి ఆత్మ సంతృప్తి, ఆత్మధైర్యం వుండాలి గానీ తమలోతాము కుంచించుకు పోయి, ముడుచుకు పోమే భీరుల్లా వుండకూడదు. విద్యార్థుల్లో మితిమీరిన ఒత్తిడికి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులే కారణం. 'మార్కులు తగ్గితే ఊరుకోను' అని తల్లిదండ్రులు, 'ర్యాంకు తగ్గితే ఇంకేమీ లేదు' అని బెదిరించే ఉపాధ్యాయులు ఈ ఇద్దరి నడుమ కత్తుల వంతెనపై నడకగా మారిపోయింది విద్యార్థి జీవితం. పుస్తకం ఎదురుగా పెట్టుకొని ఇరవైనాలుగ్గంటలూ చదవడమే గాని, పుస్తకం మూసి మననం చేసుకోవడం ఎక్కడా కనిపించడంలేదు. ఎప్పుడైతే మననానికి ప్రాముఖ్యతనిస్తారో అప్పుడే విద్యార్థులపై ఒత్తిడి తగ్గుతుంది.

ప్రాచీనకాలం నుంచి విద్యకు ఎన్నో నిర్వచనాలున్నాయి. "విద్యాదదాతి వినయం, వినయాత్‌యాతి పాత్రతామ్, పాత్రత్వాత్ ధనమాప్నోతి." అని విద్యవలన వినయం, వినయం వలన గౌరవం, అర్హత, అర్హత వలన డబ్బు వస్తుందని అన్నారు. ఇక భర్తృహరి "విద్య నిగూఢగుప్తమగు విత్తము...రూపము పూరుషాళికిన్... విద్యయశస్సు.. భోగకరి" అని విద్య రహస్యంగా దాచుకొన్న ధనంలాంటిదని, కీర్తిని, సంపదను ఇస్తుందని అన్నారు.

కానీ ఇప్పుడు విద్య వ్యాపారమయ్యాక ఒత్తిళ్లు పెంచే చదువు విద్యార్థుల ప్రాణాల్ని హరిస్తుంది. ప్రతిక్షణం భయంతో తనమీద తాను నమ్మకం కోల్పోయి, ప్రాణాలు తీసుకొంటున్నారు. తల్లిదండ్రులు పిల్లలకిష్టమైన చదువునే చదివించాలి. వాళ్ళకి తగిన స్వేచ్ఛనివ్వాలి. వాళ్ళ మనసు కనుక్కోవాలి. విద్యాసంస్థల్లో కూడ విద్యార్థులపై నిరంతర నిఘా వుంచకూడదు. ఒత్తిడి కలిగించగూడదు. వారిలోని సృజన శక్తులను వికసింప చేయాలి. అందరూ పండితులు కాలేరు కదా! ఎవరికిష్టం వచ్చిన విద్యలో వారు రాణించేలా అవకాశాలు కల్పించాలి. కట్టుబాట్లు సడలించాలి.

క్రమశిక్షణ తాటితో అందరినీ ఒకే చదువురాటకు కట్టేయగూడదు. తగిన విరామం తగిన వినోదం కల్పించాలి. కళల కిటికీ తలుపులు ఓరగా తెరవాలి. కొంచెం అభిరుచుల వెన్నెలను ప్రసరింపచేయాలి. విద్యాలయాలను శాంతినికేతనాలుగా మార్చక పోయినా, అశాంతినిలయాలకు చిరునామాలు కాకుండా వుంటే చాలు.



## (మణిపూసలు) ఉద్యమ నేత విమలా రణదివే -వకుళాభరణం లలిత

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం(ఐద్వా) వ్యవస్థాపక సభ్యురాలు, స్వాతంత్ర్య పోరాట సమరంలో వామపక్ష ప్రజాతంత్ర భావాలను మహిళలలో వ్యాపింప చేయడంలో కృషి చేసిన ప్రముఖురాలు విమలా రణదివే.. సమాన హక్కుల కోసం సాగుతున్న మహిళల ఉద్యమాన్ని కార్మిక వర్గ పోరాటాల్లో అనుసంధానం చేయడంలో విశేష కృషి చేశారు

విమల 15వ సం॥లో భారత స్వాతంత్ర్య సమరంలో విదేశీ వస్తువుల దుకాణాలను వ్యతిరేకిస్తూ పికెటింగ్‌లో పాల్గొని, విప్లవ జీవితానికి శ్రీకారం చుట్టారు. 'నువ్వేం చేస్తున్నావో నీకు తెలియటంలేదు' అన్న మేజిస్ట్రేట్ మాటకు ధైర్యంగా "నాకు తెలుసు, నేను మళ్ళీ, మళ్ళీ చేస్తూ ఉంటాను" అని సమాధానం ఇచ్చారు. అందుకే 6 నెలలు కఠిన కారాగార శిక్ష ఆమెపై పడింది. ఆ పోరాట పటిమ, చైతన్యం ఆమె తుదిశ్వాస విడిచే వరకూ కొనసాగింది.

జైలునుండి విడుదలైన తరువాత పూనేకు చేరి మెట్రిక్యులేషన్ పూర్తి చేసి, కార్వే విశ్వవిద్యాలయంలో పట్టభద్రురాలైంది. తరువాత మకాం ముంబయ్‌కి మార్చుకొని తన అన్న వరుసైన సాయి ద్వారా కమ్యూనిస్ట్ పార్టీపట్ల ఆకర్షితురాలైంది. సమావేశాలకు, సదస్సులకు హాజరవటం, మార్క్సిస్టు సాహిత్య అధ్యయనంతో ఆ పార్టీపట్ల ఆమెకు నమ్మకం ఏర్పడింది. స్పానిష్ వీర వనిత లాపాషనారా పై ఒక వ్యాసాన్ని రాసింది. దాన్నే 'స్త్రీ' అనే పత్రిక ప్రచురించింది. అదే ఆమె తొలి రచన. దాంతో ఆమెకు అంతర్జాతీయ అవగాహన, సమానత్వం, న్యాయం వంటి విలువలపై నమ్మకం ఏర్పడింది. మరాఠీ దినపత్రికలకు కూడా వ్యాసాలు రాశారు.

రాజకీయంగా ఎదిగినా, ఆర్థికంగా నిలదొక్కుకోవటం కష్టమైంది. నాగపూర్‌కు వచ్చి ఆ ప్రయత్నం మొదలు పెట్టారు. ఒక సినీ నిర్మాత సంఘుసేవ పాత్రను పోషించాల్సిందిగా ఆమెను కోరారు. స్నేహితులంతా ఆమెను ఎంతో ప్రోత్సహించారు. తరువాత ఆమె నాటకాల్లో, సినిమాల్లో నటించి పేరు తెచ్చుకొన్నారు. ఆనాడు స్త్రీలు సినిమాల్లో నటించటం అనేది ఉండేదికాదు. స్త్రీలు కూడా తమ భావాలను వ్యక్తీకరించటానికి అవకాశం ఉండాలని ఆమె చెప్పేవారు. విమల విప్లవకారిణి పాత్రలే ఎక్కువగా వేసేది. మొదటి సినిమా సాథీ, తరువాత నాలుగైదు సినిమాల్లో కూడా నటించింది. సినిమాకు 500రూ/-ఇచ్చేవారు. సంపాదనలో ఎక్కువ శాతం కమ్యూనిస్టు పార్టీకి విరాళం ఇచ్చేవారు.

కమ్యూనిస్టు పార్టీ రాజకీయాల్లో ఆమె చొరవ పెరిగింది. 1939లో పార్టీ సభ్యత్వాన్ని కూడా ఆమె స్వీకరించింది. అదే సం॥ బి.టి రణదేవ్‌తో ఆమె వివాహం జరిగింది. దాంతో పార్టీ పూర్తికాలం కార్యకర్తగా రూపొందారు. టెక్స్‌టైల్ వర్కర్స్ సమ్మెలో పాల్గొని తరువాత ప్రజా ఉద్యమాల్లో చురుకైన పాత్రను వహించారు. బొంబాయి నగరంలో సైకిల్‌పై తిరుగుతూ, సమావేశాలకు హాజరయ్యేవారు. కార్మికుల సమావేశాల్లో విప్లవకర పాటలు పాడుతూ, తన ఆడపడుచు అహల్యరంగ్నేకర్‌తో కలిసి శ్రామిక మహిళా సంస్థను స్థాపించారు. అదే పటేల్ మహిళా సంఘం. పేద మహిళల సమస్యలకు వ్యతిరేకంగా పోరాడారు. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా ఒక ఆయుధంలా ఉపయోగించారు. అఖిల భారత మహిళా మహాసభను ఏర్పాటు చేయటంలో ముఖ్య పాత్రను వహించారు. ఎ.ఐ.డి. డబ్ల్యూ.ఎ. జాతీయ కమిటీ సభ్యురాలిగా ఎన్నికయ్యారు. అంగన్‌వాడీ వర్కర్స్ ఫెడరేషన్ ఏర్పాటు చేయటంలో ముఖ్య పాత్ర వహించారు. సి.ఐ.టి.యు కార్యదర్శిగా ఆల్ ఇండియా ప్లాంటేషన్ వర్కర్స్ ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శిగా, ఐద్వాలో ఉపాధ్యక్షురాలిగా పని చేశారు. మరణించే నాటికి భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యురాలైనారు.

విమలాదీదీ ఒక నాయకురాలిగా సమస్యలను అర్థం చేసుకొని వారిని ప్రోత్సాహించేవారు. పురుషాధిక్యతకు వ్యతిరేకంగా పోరాడేవారు. ఆమెకు పనిలో శ్రద్ధ, నిబద్ధత ఉండేవి. క్రమశిక్షణను పాటించేవారు. నిరాడంబరతకు ఆమె ఉదాహరణ. కార్మిక వర్గ, శ్రామిక మహిళల ప్రయోజనం కోసం ఎంతో కృషి చేశారు. సావిత్రిబాయి పూలే, అన్నాకార్వే వంటి మహిళల స్ఫూర్తితో జాతీయోద్యమంలోనే గాక మహిళల సమాన హక్కులకోసం పోరాడారు. తల్లిదండ్రులు

అభ్యుదయవాదులు కావటంతో ఆమెకు ఆ చొరవ ఏర్పడింది. వాళ్ళ చొరవతో ఏర్పడ్డ బోర్డింగ్ స్కూల్లో కొన్నాళ్ళు ఆమె కూడా పని చేశారు. 1929లో, అన్నా కార్వే పాఠశాలలో చేరినప్పుడు జాతీయ రాజకీయ జీవితం పటిష్టమైంది. ఆంగ్లేయులు ఆ పాఠశాలపై కూడా కొన్ని ఆంక్షలు విధించారు. పాఠశాలనుంచి బలవంతంగా నెట్టినా ఆమె వెళ్ళేవారు కాదు. ఉప్పు సత్యాగ్రహం, విదేశీ వస్తు బహిష్కరణ, మద్యం దుకాణాల బహిష్కరణ విషయంలో పాల్గొనేవారు. ప్రదర్శనల్లో పాల్గొంటూ, పాటలు పాడేవారు. 'జాతీయ వాదం, స్వాతంత్ర్యం అంటే అర్థం తెలుసునా?' అని మెజిస్ట్రేట్ అడిగారు. క్షమాపణ చెప్తే అమ్మాయిలను ఖైదు చేయకుండా ఉంటామని ఆంగ్లేయులు చెప్పారు. కానీ పట్టుదలతో నిలవటంతో ఆరు మాసాల కఠిన కారాగారవాస శిక్ష తప్పలేదు. బొంబాయి నుంచి పూనాకు తీసుకెళ్ళారు. జైల్లో 800 మంది మహిళలుండటం ఆశ్చర్యం. సరోజినీ నాయుడు, కమలాదేవి ఛటోపాధ్యాయ కూడా అందులో ఉండేవారు. జైల్లో రోజుకు 5-6 మంది యూనిఫాంలు కుట్టడానికి సిద్ధమైనారు. ఆడుతూ, పాడుతూ సంతోషంగా జైలు శిక్షను అనుభవించారు. అప్పుడే గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగింది. ఏదో చేయాలని, ఎన్నెన్నో ఆలోచనలు వచ్చేవి. అప్పుడే స్వాతంత్ర్యం లభించాలంటే సాయుధ పోరాటం అవసరమని భావించారు. సావర్కర్‌ను కలుసుకొంటే ఆయన బుద్ధిగా పాఠశాలకు వెళ్ళమని సలహా ఇచ్చారు. 16 ఏళ్ళ వయసులో ఆమె మెట్రిక్యులేషన్ పాసయ్యారు. చదువు, నాటకాలు, క్రీడల్లో మునిగి తేలినా, రష్యా విప్లవం, ప్రపంచ వ్యాప్తంగా దాని ప్రభావాన్ని గూర్చి పత్రికల్లో చదివేవారు. సోషలిస్టు సిద్ధాంతం భారతదేశంలో అమలు జరగాలని కోరుకున్నారు. 1935లో ఏర్నివాండేలో పట్టభద్రురాలైంది. బొంబాయిలో కింగ్‌జార్జి కళాశాలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి కుటుంబానికి ఆసరాగా ఉండేది. అప్పుడే సర్‌దేశాయ్ కుమారుని సాహచర్యంతో రాజకీయాల్లో పాల్గొనటం ప్రారంభమైంది. అప్పుడే వామపక్ష రాజకీయాలకు సంబంధించి ఎన్నో గ్రంథాలను చదవటం, పార్టీకి విరాళాలు సేకరించటం జరిగాయి.

1946 నాటి పరిస్థితి ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉండేది. నౌకాదళ సమ్మె బొంబాయి నగరం అంతా స్తంభించిపోయేట్టు చేసింది. భారత దేశంలో ఆంగ్లేయ పాలన అంతంకావాలని భావించేవారు. రణదివేకు కూడా మహిళల ఉద్యమం పట్ల నమ్మకం ఉండేది. ఈ సమస్యను యూనియన్ సమావేశాల్లో లేవనెత్తేవారు. ఆయనకున్న ఆసక్తి, మద్దతు వల్ల అఖిల భారత శ్రామిక మహిళా సమన్వయ సంఘాన్ని ఏర్పరచటం జరిగింది. జాతీయ ఉద్యమంలో రణదివే, విమల ఇరువురూ అరెస్ట్ అయ్యారు. ఆమెను బొంబాయిలో అరెస్ట్ చేసి ఎరవాడ జైలుకు పంపారు. 1948 నుంచి 1951 వరకు జైల్లోనే ఉన్నారు. దాదాపు 8-9 ఏళ్ళు జైలు జీవితం గడిపారు. అనారోగ్యానికి గురై 1999 జులై 24వ తేదీన మరణించారు. కష్టపడి ఉద్యమం నిర్వహిస్తున్న మహిళలందరి లోనూ ఆమె ఉన్నారు. తాను నమ్మిన ఆశయం కోసం తుది వరకు పట్టుదలతో పోరాడేవారు. పోరాట పటిమలో ఆమె ఒక ఆదర్శంగా నిలిచిపోతారు. జీవిత కాలమంతా ఉద్యమాలతోనూ, మహిళా సమస్యల పరిష్కార మార్గాలను అన్వేషించటంలోనూ విలువైన జీవితాన్ని గడిపిన నాయకురాలిగా, కమ్యూనిస్టు పార్టీ మహిళా కార్యక్రమాలన్నింటిలోనూ చురుగ్గా పాల్గొని ప్రధానమైన నాయకురాలిగా పేరుపొందిన విమలాదీదీ జీవితం ఎంతో స్ఫూరిదాయకమైంది.



## అభినందనలు..

త్రిపుర రాష్ట్రానికి చెందిన దీపాకర్మాకర్ రాబోయే ఒలంపిక్స్‌లో జిమ్నాస్టిక్స్ విభాగంలో ఆడేందుకు అర్హత సాధించింది. 6సం॥ నుంచే ప్రాక్టీస్ చేయడం మొదలుపెట్టింది. 2007 నుంచి 77 మెడల్స్‌ను సాధించింది. చైతన్యమానవి అద్భుత విజయాలను సాధించిన దీపకు అభినందనలు తెలియజేస్తుంది.



## సీరియల్ మరో అమ్మ - రూజ్‌వెల్ట్ వలలో జాన్ మిట్చెల్

యునైటెడ్ మైన్‌వర్కర్స్ యూనియన్ నాయకత్వంలో రాక్షస బొగ్గుగని కార్మికులసమ్మె వసంత కాలంలో మొదలైంది. సమ్మెకు ప్రజల నుండి సంపూర్ణ మద్దతు లభించింది. ఫ్యాక్టరీలకు, రైల్వేలకు బొగ్గు సరఫరా పూర్తిగా ఆగిపోయింది. చలికాలం కావడాన న్యూయార్క్‌లో జన జీవితం ఇబ్బందుల్లో పడింది. అక్టోబర్‌లో అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ రంగంలోకి దిగాడు. యజమానుల సంఘం నాయకులను, యూనియన్ నాయకులను వాషింగ్టన్ పిలిపించి సంప్రదింపులు ప్రారంభించాడు.

గని యజమానులు కార్మికులతో ఏరకమైన ఒప్పందం చేసుకోవడానికి సిద్ధంగా లేకపోగా మిలిటరీని రప్పించి, కార్మికులను తుపాకులతో బెదిరించి బలవంతంగానైనా సరే గనుల్లోకి నెట్టాలని, ఆ తరువాతే యూనియన్‌తో చర్చ ఊసెత్తాలని యజమానుల సంఘం అధ్యక్షుడు బేర్ షరతులు పెట్టాడు.

చర్చలు విఫలమయ్యాయి. రూజ్‌వెల్ట్ మైన్ వర్కర్స్ యూనియన్ అధ్యక్షుడు జాన్ మిట్చెల్ కోసం కబురు పంపించాడు. మిట్చెల్ వచ్చాడు. రూజ్‌వెల్ట్ మిట్చెల్ భుజం మీద తట్టి, అతన్ని పొగడ్తల్లో ముంచెత్తాడు. తాను గొప్ప దేశభక్తుడనని, ప్రజల ప్రయోజనాలకే కట్టుబడి ఉన్నాను తప్ప యజమానుల కోసం కాదని నమ్మబలికాడు.

మిట్చెల్ సమావేశం జరిగిన తీరు గురించి గని కార్మికులకు చెప్పాడు. “సరే, మంచిదే. మన దగ్గర సరిపడా డబ్బులున్నాయి. ఫలితం వచ్చేదాకా పోరాడుదాం. మనతో ఒప్పందం చేసుకునేదాకా, యూనియన్‌ని గుర్తించేదాకా మన పోరాటం ఆగకూడదని”, కార్మికులు నిర్ణయించుకున్నారు. వారు సమ్మె మొదలు పెట్టినప్పుడు వాళ్ళ దగ్గర తొంభై వేల డాలర్ల సొమ్ము యూనియన్ ఖాతాలో ఉండేది. సమ్మె ముగించే నాటికి అవి పది లక్షల డాలర్లు అయ్యాయి. ఆ ధైర్యంతోనే ఏ అవాంతరాన్నైనా ఎదుర్కోవడానికి సిద్ధపడ్డారు.

యూరప్ పర్యటనలో ఉన్న అమెరికా వ్యాపార దిగ్గజం జె.పి. మోర్గాన్‌ను వెంటనే వెనక్కి రమ్మని వాల్‌స్ట్రీట్ కబురు పంపింది. అప్పటికే బొగ్గు యజమానులకు పరిస్థితి ముందునుయ్యి వెనకగొయ్యిగా మారింది. వీళ్ళ మొండితనానికి ప్రజలు మండిపడ్డారు.

ఈ స్థితిలో నన్ను న్యూయార్క్ రమ్మని, సమ్మె గురించి చర్చించాలని కబురు వచ్చింది. నేను అప్పుడు మౌంట్ గోమెర్రీలో ఉన్నాను.

నేను విల్‌కెస్-బర్రెలోనున్న యూనియన్ సెంట్రల్ ఆఫీస్‌కు వెళ్ళి మిట్చెల్‌ను కలిశాను. ‘వెళ్ళండమ్మా! కానీ బయట వ్యక్తుల మధ్యవర్తిత్వానికి మాత్రం ఒప్పుకోవద్దు. ఈ సమ్మెలో యూనియన్ ఖచ్చితంగా యునైటెడ్ మైన్ వర్కర్స్ యూనియన్‌తో చర్చలకు రాకతప్పదు’ అని మిట్చెల్ అన్నాడు. విషయాలన్నీ ఎప్పటికప్పుడు తెలియజేస్తానని అతనికి నేను చెప్పాను.

నేను, మరో మిత్రునితో కలిసి మోర్గాన్ ఆఫీస్‌కు వెళ్ళాను. మోర్గాన్ చాలా ఆందోళనగా ఉన్నాడని అతన్ని కలిసిన నా మిత్రుడు చెప్పాడు. గని కార్మికుల ఐక్యత ముందు యజమానుల ధనబలం తలవంచక తప్పదం లేదు. అయినా జిత్తుల మారి తనంతో యూనియన్ను అదుపులో పెట్టే ప్రయత్నాలు మొదలెట్టారు.

మోర్గాన్ సలహాతో ఆదివారం మధ్యాహ్నం, న్యూయార్క్ సమీపంలోని నదిలో ఉన్న పడవలో గని యజమానులు బేర్ సారధ్యంలో మీటింగు పెట్టారు. రూజ్‌వెల్ట్ ప్రతినిధి రూట్ వారితో చేరాడు. ఆ సమావేశానికి పత్రికా విలేకరులను అనుమతించలేదు. టెలిఫోన్‌లు లేవు. టెలిగ్రామ్‌లు లేవు. మెసేజ్‌లు లేవు. గని యజమానులతో ప్రభుత్వ ప్రతినిధి రూట్ రహస్యంగా మంతనాలు జరిపాడు. ‘సమ్మెను ఎలా విఫలం చెయ్యాలి? యూనియన్‌ను ఎలా అణగదొక్కాలి?’ అనేదే వారి ఎజెండా.

ఇది ఎలా చెయ్యాలో రూట్ ప్రతిపాదిచాడు. ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ విచారణ కమిటీని నియమిస్తాడు. అంటే ఈ కమిటీ మధ్యవర్తిత్వం చేస్తుందన్నమాట. ఈ కమిటీకి గనుక యూనియన్ తన డిమాండ్లను ఇవ్వనట్లయితే, యూనియన్ కావాలనే సమ్మె పరిష్కారానికి సిద్ధంగా లేదని ప్రజల్లో ప్రచారం చేసి, ప్రజాభిప్రాయాన్ని యూనియన్‌కి వ్యతిరేకంగా మలచవచ్చు. తద్వారా యూనియన్ పట్టు తగ్గించవచ్చు.

సోమవారం ఉదయం నా మిత్రుడు మోర్గాన్‌ని కలవడానికి 209 మాడిసన్ అవెన్యూకి వెళ్ళాడు. తిరిగి మా దగ్గరకు వస్తూనే ‘సమ్మె విరమించబడిందని’ గట్టిగా అరిచాడు. నేను

విల్‌కెస్-బర్రెకి తిరిగి వచ్చేటప్పటికే మిట్చెల్ వాషింగ్టన్ ప్రయాణమయ్యాడు. అధ్యక్షుడు నియమించిన కమిటీ మధ్యవర్తిత్వాన్ని అంగీకరించేందుకు సిద్ధపడ్డాడు. నేను వద్దని వారించాను. కానీ అతను నామాట వినే స్థితిలో లేడు. ప్రెసిడెంట్ మాటను ఎన్నటికీ కాదనలేనని అన్నాడు.

'మీరు ప్రెసిడెంట్‌ని బాగానే క్షమించార'ని చురకపెడుతూనే 'గత సమావేశంలో గని కార్మికులను సైన్యంతో కాల్పించిన తరువాతనే యూనియన్‌తో చర్చలు జరుపుతామని యాజమానుల సంఘం నాయకుడు బేర్ అన్న విషయం, దానికి సమాధానంగా కార్మికులు యునైటెడ్ మైన్ వర్కర్స్ యూనియన్‌ని గుర్తించేవరకు పోరాడతామన్న విషయం ప్రెసిడెంట్‌తో చెప్పండి' అని అన్నాను, అతన్ని ఎలాగైనా దారిలో పెట్టాలని.

మిట్చెల్ అందుకు అంగీకరించలేదు. 'నేను ఈ విషయాలను చెప్పడానికి వెళ్ళడం లేదని' జవాబిచ్చాడు.

ఆ రోజు రాత్రి, ప్రెసిడెంట్ ప్రజావ్యవహారాలు చూసే వెల్‌మాన్‌తో కలిసి మిట్చెల్ వాషింగ్టన్‌కు వెళ్ళాడు. మరుసటి రోజు ఉదయం ప్రెసిడెంట్‌ను కలిసేందుకు మిట్చెల్ వెళ్ళాడు. అతను వైట్ హౌస్ నుండి బయటకు వచ్చేముందు పత్రికా విలేకరులు, మేగ్జైన్ల సంపాదకులు, చర్చి పెద్దలు మిట్చెల్‌ను అమెరికాలో కెల్లా గొప్ప కార్మికనాయకుడని పొగిడారు. మిట్చెల్ మోసగాడు కాకపోవచ్చు, కానీ ముఖస్తుతికి పడిపోయాడు. ఈ బలహీనతను ఉపయోగించుకునే యజమానులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం యూనియన్ శక్తిని దెబ్బకొట్టారు.

మిట్చెల్ విల్‌కెస్ - బర్రెలోని యూనియన్ సెంట్రల్ ఆఫీసుకు తిరిగొచ్చేసరికి చర్చి పెద్దలు, మంత్రులు, రాజకీయ నాయకులు మోకాళ్ళపై సాగిలబడ్డారు. అతనికి స్వాగతం పలకడానికి సంగీతదళం ఏర్పాటు చేశారు. అతని బగ్గీకి కట్టిన గుర్రాలను తీసేసి మనుషులనే పెట్టారు. అతని గౌరవార్థం బండి ప్రక్కగా, బ్యానర్లతో ప్రదర్శన చేశారు.

ముఖస్తుతికి, సన్మానాలకు మిట్చెల్ లొంగిపోయాడు. సమ్మె డిమాండ్లు నెరవేరాయి కానయితే మిట్చెల్ గనక లొంగిపోకుండా నిక్కచ్చిగా ఉండి ఉన్నట్లయితే యూనియన్ నాయకులతో చర్చలు జరిగేవి. యూనియన్‌కి గుర్తింపు వచ్చి ఉండేది. ఇది కార్మికులు ఐక్యం అయ్యేందుకు ఉపయోగపడేది. ఒక నైతిక విజయం వచ్చేది. ఇది ఆర్థికపరమయిన లాభాలకన్నా గొప్ప విజయం అయ్యేది.

మిట్చెల్ మరణించేనాటికి బాగా డబ్బు గడించాడు. కానీ అతను ఏ కార్మికుల కోసమైతే ఒకప్పుడు పనిచేసాడో, ఆ కార్మికుల నమ్మకాన్ని కోల్పోయాడు.

ఈ సమ్మె ఫలితంగా ఐరిష్ హెస్సియన్ చట్టం వచ్చింది. దీని ఫలితంగా ప్రభుత్వ పోలీస్ కానిస్టేబుళ్ళ దళం ఏర్పడింది. ఈ చట్టాన్ని రైతుల ప్రయోజనాల కోసం తెచ్చామని నమ్మించజూశారు. కానీ వాస్తవానికి కార్మిక సంఘాలను అణిచిపెట్టడం కోసం ఈ చట్టం వచ్చింది. కార్మికులు హారిస్‌బర్గ్‌కి వెళ్ళి చట్టాన్ని మార్చడం కోసం ప్రయత్నించారు. ఫలితంలేకపోయింది. కార్మికులు, గని యజమానులు కిరాయి దళాలను తీవ్రంగా ద్వేషించేవాళ్ళు. ఈ దళాలకన్నా ఏదైనా మంచిదేనని భ్రమపడ్డారు. అయితే యజమానుల ఈ కిరాయి మూకలతో ప్రభుత్వ పోలీసు దళాలు కలిసిపోతారని ఈ ఉక్కుపాదాల కింద కార్మికవర్గం నలిగిపోతుందని పాపం అమాయక జనం తెలుసుకోలేకపోయారు. వారు ఐర్లాండ్ చరిత్రను మర్చిపోయారు. ఈ ఐరిష్ హెస్సియన్ చట్టం రాకమునుపే ఐర్లాండ్ భూమి కార్మికులు, మహిళల రక్తంతో తడిసింది. ఈ రక్తం ప్రభుత్వ కానిస్టేబుళ్ళ క్రూరత్వం వల్ల చిందిందేనని మర్చిపోయారు.

ఈ దళం గురించి నా భయాలు నాకున్నాయి. అదే తోటినాయకులకు చెప్పాను. ఒక నాయకుడు నాతో ఏకీభవిస్తూనే, ఏ మాత్రం నిజాయితీ వున్న వారెవరూ ఈ దళంలో చేరరన్న భరోసాతో వున్నాడు. కానీ దొంగలు, దుర్మార్గులు ఉండకపోరు కదా! ఈ దళంలో చేరే దొంగలు, గన్‌మెన్లకు వ్యతిరేకంగా భవిష్యత్తులో కార్మికులు పోరాటాలు చేయక తప్పదని నేను అన్నాను.

నేను అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ నియమించిన విచారణ కమిటీ సమావేశాలకు హాజరయ్యేదాన్ని. అంతకు ముందు కమీషన్ ఎదుట హాజరయిన మిట్చెల్, "20సం॥లకు పైగా రాక్షసబొగ్గు గని కార్మికులు భరించలేని, అమానవీయ పరిస్థితుల్లో బ్రతుకులీడుస్తున్నారు. ఈ రోజు వారందరూ కలిసి తాము అనుభవిస్తున్న బాధలకు పరిష్కారం కోరుతున్నారు." అని చెప్పిన 'సూక్తులు' ఎన్నటికీ మర్చిపోను.

యజమానుల సంఘం అధ్యక్షుడు బేర్, "కార్మికుల ప్రయోజనాలు కార్మికుల కోసం పోరాడే వారి వల్ల పరిరక్షింపబడవు. దేవుని యొక్క అనంతమైన జ్ఞానం ఈ దేశపు ఆర్థిక ప్రయోజనాలు కాపాడే హక్కును క్రిస్టియన్లకిచ్చింది. వారి వల్ల మాత్రమే కార్మికులకు మేలు జరుగుతుందని" చెప్పిన

'ప్రవచనాలను' కూడా నేను ఎన్నటికీ మర్చిపోను.

'సర్వశక్తి వంతుడైన ఆ దేవుని దూతలు రోజూ ఈ కార్మికులు చనిపోవడం చూస్తారు. కార్మికులను కుంటివారిగా, గుడ్డివారిగా, అవిటివారిగా చెయ్యడం కూడా చూస్తారు. ఎటువంటి నష్టపరిహారం చెల్లించకుండా కార్మికులను సత్రాల్లో వదిలెయ్యడం చూస్తారు. రోడ్డుమీద పడెయ్యడం చూస్తారు. బొగ్గు గని కార్మికుడు జీతం చాలక, తన కూతుళ్ళను సిల్క్ మిల్లుల్లో 10 సెంట్ల కూలికోసం రోజుకు 12గం॥ పని చెయ్యడానికి పంపించడమూ చూస్తారు. యజమానుల సంఘం నాయకుడు బేర్ కార్మికులు యూనియన్‌లో చేరి చెడిపోతారని మొసలికన్నీరు కారుస్తున్నాడు. కానీ ఆ పెద్దమనిషే కార్మికుల్ని పనిలో నుండి తొలగించడానికి ఏ మాత్రం విచారించడు' అని కార్మికుల న్యాయవాది 'క్లారెన్స్ డారో' చెప్పిన కఠోర సత్యాలను కూడా నేనెప్పటికీ మర్చిపోను. అతను ఇంకా, "మానవ జాతి అభివృద్ధి కోసం ఈ ప్రపంచం ప్రారంభమైనప్పటి నుండి జరిగిన పోరాటాలలో ఇది ఒక ముఖ్యమైన పోరాటం. మానవ జాతి విజయం సాధించిన ప్రతిసారీ పెద్ద మూల్యం చెల్లించింది. కొంతమంది బ్రతకడం కోసం మరికొంతమంది చంపబడ్డారు. తమ కోసమే కాకుండా యావత్ మానవ జాతిని మరో మెట్టు పైకి ఎక్కించేందుకు ఈ పేద గని కార్మికులు శిలువను మోస్తున్నారు" అని అతను అన్న ముగింపు మాటలను కూడా నేను ఎన్నటికీ, ఎన్నటికీ మరువను. గని కార్మికుల డిమాండ్లను పరిశీలించేందుకు ఏర్పడ్డ కమీషన్ గని కార్మికుల డిమాండ్లకు అనుకూలంగా తీర్పు ఇచ్చింది. యజమానులు గౌరవ ప్రదంగా డిమాండ్లకు తలొగ్గారు. ఈ విధంగా కార్మికులు దొడ్డిదారి నుండే విజయ సౌధంలోకి అడుగుపెట్టారు.

– సశేషం.



కవిత

# నిప్పుకణిక

రచన:- డా. చిన్న లక్ష్మి కళావతి.

అమ్మా..... అమ్మా
ఎక్కడున్నావమ్మా.... ఎక్కడికి వెళ్ళావమ్మా
నన్ను చూడడమే నీకు ఇష్టంలేదా?
నా పిలుపే నీవు భరించలేవా అమ్మా
నన్ను కని పురిటిలోనే పుడమని విడిచివంట
నన్ను పెంచి పెద్ద చేసే బాధ్యతను విస్మరించావా
పురిటిలోనే అమ్మను మింగిన ఆడదని
అందరూ నన్ను నిందిస్తుంటే వినడానికే బాధగా ఉందమ్మా
అమ్మా నేనే నిన్ను చంపుకున్నానా?
నాజన్మ నీజన్మను అంతం చేస్తుందని
ముందేనాకు తెలిసి వుంటే
నిన్ను చంపే ఈ జన్మనాకు వద్దని గట్టిగా అరిచేదానమ్మా
నీ కన్నవారింట్లో నీకు కష్టాలేనంట ఆడపిల్లవని
అత్తారింట్లో నీకు ఆరళ్ళేనంట
ఇన్ని కష్టాలు పెదవి విప్పకుండా ఎలా భరించావమ్మా
ప్రశ్నించే తత్వాన్ని, ధిక్కరించే స్వరాన్ని ఎందుకు
విన్పించలేదమ్మా
నాపుట్టుకకు ముందే వీళ్ళు నిన్ను చంపేశారు కదమ్మా
జీవచ్ఛవంగా బతుకీడుస్తున్న
నాతల్లిని నేను మళ్ళీ చంపుకొంటానా?
ఎదురించని సంస్కృతి సంప్రదాయ చట్రంలో బంధీవై
సహనానికి మారుపేరుగా నిలిచిన నీకు
ఈ సమాజం నీకు ఏం సత్కారం చేసిందమ్మా
అమ్మా నేను నీ కూతుర్ని
నీ మరణం నుండి పుట్టిన నీ మరో జన్మని
నీవు పొందిన వేదన రోదన
మరే స్త్రీ జీవితంలో తొంగిచూడకుండా
పిడికి బిగించి ఉద్యమ శంఖారవం మ్రోగించి
స్త్రీ ఆది శక్తి స్వరూపిణి, చైతన్య స్ఫూర్తి అని చాటుతూ
లింగ వివక్ష రూపు మాపే ప్రయత్నంలో
నాప్రాణాలైనా అర్పిస్తా
సహనానికి మారుపేరుగా నిలిచే స్త్రీ
అవసరమైతే నిప్పుకణిక అవుతుందని నిరూపిస్తా
స్త్రీ జాతి ఉద్ధరణకు
నీవు నన్ను వెలిగించిన జ్యోతి అని ఋజువు చేస్తా

# పోరాటం ఆధునిక బానిసత్వంలో బ్రాండిక్స్ కార్మికులు - బి. ప్రభావతి

**వి**శాఖజిల్లా అచ్యుతాపురం సెజ్‌లో 16,000 మంది మహిళా కార్మికులు పని చేస్తున్నారు. వారిలో 2,000 మంది స్టాఫ్ , హెచ్ ఆర్ వంటి సిబ్బందితో కలిపి మొత్తం 18,000 మంది కార్మికులు పని చేస్తున్నారు. జిల్లా నలుమూలల నుండి ఇక్కడకు వస్తారు. గ్రామీణ ప్రాంతంలో నిరుద్యోగ సమస్య తీవ్రత ఎక్కువగా ఉంది. ఇంత పెద్ద సంఖ్యలో కార్మికులు పని చేస్తున్న సంస్థ విశాఖలో మొదటిది స్టీల్‌ప్లాంట్ (((ప్రభుత్వరంగ సంస్థ) రెండవది అచ్యుతాపురం సెజ్.

9సం॥ల క్రితం (2007) లో అచ్యుతాపురంలో 1000 ఎకరాల స్థలం ఎకరానికి ఒక రూపాయి చొప్పున వైఎస్ఆర్ ప్రభుత్వము శ్రీలంక కంపెనీకి లీజ్‌కు ఇచ్చింది. ఇందులో బ్రాండిక్స్ కంపెనీ ప్రధానమైంది. ఈ కంపెనీ రాకముందు అచ్యుతాపురంలో సశ్యశ్యామలంగా పంటలు పండేవి. వరి, చెరకు, కూరగాయలు వంటి పంటలు పండించుకునే వారు. సెజ్ పరిశ్రమ  నుండి వెలువడే వ్యర్థ జలాల వలన ప్రక్క గ్రామంలో మత్స్య సంపద నాశనం అయిపోయింది. పంటలు లేవు. వృత్తులు పోయాయి. అంతవరకు ఇంటికే పరిమితమైన రైతు మహిళలు బయటకు వచ్చి పనిచేసికొనే పరిస్థితి ఏర్పడింది. అన్ని సామాజిక తరగతుల స్త్రీలు కుట్టుపని నేర్చుకొని ఈ కంపెనీలలో పనిచేస్తున్నారు. 10వ తరగతి చదివిన అమ్మాయిలే ఎక్కువ మంది దీనిలో పని చేస్తున్నారు. ఈ ఉద్యోగాలు చేస్తున్న మహిళాకార్మికుల సమస్యలు పరిశీలించిట్లయితే ఇంత ఘోరమా అని అనని వారు ఉండరు.

**కనీస వేతనాలు లేవు:-** కంపెనీలు గ్రామాలకు బస్సులను పంపిస్తాయి. ఎ షిఫ్టు, బి షిఫ్టు వుంటుంది. 6గం॥నుండి 2.30, 2.30గం॥ నుండి 10.30 వరకు వుంటుంది. బి షిఫ్టు వాళ్ళు ఇండ్లకు వెళ్ళేసరికి 12గం॥ అవుతుంది. దీనిలో భోజన విరామం 30ని॥ మాత్రమే ఇస్తారు. కటింగులు పోను వారి చేతికి 4,500 ఇస్తారు.(బస్సు, పిఎఫ్ కటింగ్ ) కటింగ్ చేస్తారు. కనీస వేతనాలు లేవు.  శ్రమ అధికంగా వుంటుంది. ఓటి చెయ్యమంటారు. ఒక లైనులోని 16 మంది ఓటి చేస్తే 2,000 దాకా వస్తాయి. కానీ ఆ నెల ఆడిట్ ఫెయిల్ అయ్యిందని  ఒక రూపాయికూడా ఇవ్వరు. కాని వారు కుట్టిన దుస్తులు మాత్రం ఎగుమతి అవుతాయి. అంటే కంపెనీ లాస్ అవదు. కార్మికుల రక్తాన్ని జలగల్లాగ పీల్చి శ్రమ దోపిడీ చేస్తున్నారు. ఎవరైన మా ఓటీకి సొమ్ము అందలేదని అడిగితే నోరు లెగుస్తుంది! గడ్డి కోసుకునే వారికి ఈ జీతాలే ఎక్కువ!  పేడ పిసుక్కునే వారికి ఈ హోదా కల్పించాం!  అని తిడతారు.

**ఆరోగ్య సమస్యలు:-** బ్రాండిక్స్‌లో పని చేస్తున్న మహిళలు (అమ్మాయిలు 18 నుండి 30 లోపు వారు పని చేస్తున్నారు.) సన్నని నూలు పోగులు వెదజల్లే ధూళి కణాలు ముక్కుల్లోకి పోవడం వలన ఊపిరి తిత్తుల సమస్యలు, కిడ్నీ సమస్యలు, రక్తహీనత, గైనిక్ మొదలగు సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఈ కాలంలో 4గురు మహిళలు చనిపోయారు. ఎవరూ 3 సం॥లకు మించి పనిచేయలేరు. ఇఎస్ఐ లేదు. బ్రాండిక్‌లో వర్క్ చేస్తున్న కార్మికులు కళ్ళు తిరిగి పడిపోవడం తరచూ జరుగుతూ వుంటుంది. ఇంత పెద్ద సంస్థలో పనిచేస్తున్న మహిళా కార్మికులకు ఇఎస్ఐ లేదంటే కార్మికచట్టాలు అమలు లేదని ఇట్టే పసిగట్టవచ్చు. ఎవరికైనా కడుపునొప్పి వచ్చి డాక్టరు దగ్గరకు వెళితే ఇప్పుడు కడుపు  నొప్పి ఏంటి? 9.30 గంటలకు కదా రావాలి అని అంటారు. అంటే కడపునొప్పికి ఈ టైమ్‌కు రావాలని ఏమైనా తెలుసా? రోగం ఎప్పుడైనా రావచ్చు. బ్రాండిక్స్ కంపెనీ ఒకే యూనిటతో మొదలుపెట్టి  ఏడు యూనిట్‌లకు పెరిగింది. కోట్లరూపాయాలు ఆర్జించి లాభాలలో ఉంది.

**పని స్వభావం :** ఒక కటింగు డిపార్ట్‌మెంటులో ఒక సెక్షన్‌కు 120 మంది ఉంటారు.  లైనుకు 16 మంది ఉంటారు. ఒక లైనులో వున్న 16 మంది ఒక గంటకు 250 [outing] కుట్టాలి. వారి బేసిక్ వేతనం మాత్రం రూ. 3,950/- టార్గెట్‌లు పెరుగుతుంటాయి. జీతం మాత్రం పీస్ రేట్ ప్రకారం నిర్ణయించరు. సెలవలుండవు. బ్రాండెడ్ లో దుస్తులు అమ్ముతున్న ఈ కంపెనీలు ఒక్కో మహిళా కార్మికురాలిపై రోజుకు లక్షన్నర రూపాయలు ఆదా చేస్తారు. కానీ నిర్ణయించిన టార్గెట్ కుట్టకపోతే బోర్డు దగ్గరకు రెక్కలు పట్టుకొని లాక్కెళ్ళి హెచ్.ఆర్‌లో కూర్చోబెట్టి ఇష్టం వచ్చినట్లు తిడతారు. ఒళ్ళు బలిసిందా? ఉద్యోగం మానెయ్యాలని ఉందా? గడ్డి కోసుకునే వారికి ఏమీ రాదని తిట్ల వర్షం కురిపిస్తారు. బాధతో వచ్చిన ఏడుపును దిగమింగి తొందరగా కుట్టడానికి ప్రయత్నం చేస్తుంటే  నీడిల్  విరిగి చేతికి గుచ్చుకోవడం సర్వ సాధారణం. రక్తం కారుతుంటే

5 నిముషములు మాత్రమే కూర్చోబెడతారు. అంతేకాని పర్మిషను ఇచ్చి బయటకు పంపించరు. చికిత్స చేయించడం వంటివి ఉండవు. భోజన విరామం అరగంటలో బాతురూంకి వెళ్ళాలి, క్యారేజీ లాకరు ఒకచోట, వాష్‌రూమ్ ఒకచోట వీటన్నింటి వద్ద క్యూ. ఇలా అరగంట అయిపోతుంది. రోజుకు ఒకసారి మాత్రమే వాష్‌రూమ్‌కి వెళ్ళాలి. రెండోసారి వెళితే వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు వేలిముద్ర వేసి వెళ్ళాలి. ఒకవేళ ఏదేని ఇతర నెలసరి సమస్యల వలన కొంతసేపు బాత్‌రూమ్ దగ్గర వుంటే బాత్‌రూమ్ దగ్గరకు వచ్చి తలుపు కొడతారు. మంచినీళ్ల గ్లాసులు కూడా లాగేసుకుంటారు. మంచినీళ్ళు తాగకపోవడం వల్ల మహిళలు అనేక గైనిక సమస్యలు ఎదుర్కొంటున్నారు.

బ్రాండిక్స్ 3వ యూనిట్‌లో గంటకు 540 దుస్తులు అవుట్‌పుట్ ఇవ్వాలి. సెలవులు లేవు. ఒకవేళ జ్వరం వచ్చి లీవులెటరు పంపినా సెలవు ఇవ్వరు. డ్యూటీకి వెళ్తే బయట నిలబెట్టేస్తారు. ఇక్కడ పనిచేస్తున్న చాలా కుటుంబాలలో మగ వాళ్ళు మద్యానికి బానిసలు అవ్వడం వలన కుటుంబాలు నడిపే బాధ్యత స్త్రీలపైనే పడింది. పెళ్ళికాని అమ్మాయిలు కట్నకానుకలు కూడా తామే సంపాదించుకోవాలి. అందువలన ఎన్ని ఇబ్బందులు, అవమానాలు ఎదుర్కొనైనా పనిచేయవలసిన పరిస్థితి. ఇంత ఇబ్బందుల్లో పనిచేస్తుంటే పి.ఎఫ్ డబ్బులు 58 సంవత్సరములకే వస్తుంది. కేంద్రప్రభుత్వం చట్టం చేసిందని మీటింగు పెట్టి యాజమాన్యం చెప్పింది. కంపెనీలోఅదనపు శ్రమవలన 3,4 సంవత్సరములకంటె పని చేయలేరు. ఇప్పటివరకు పనిమానేస్తే పి.ఎఫ్ డబ్బులు మాత్రమే ఇచ్చి పంపించే పరిస్థితి ఉంది. కనీసం వర్క్‌మేన్ కాంపెన్‌సెషన్ ఇవ్వరు. ఇక 58 సం॥ల వరకు వేచి చూసే పరిస్థితి లేదు. దానితో కార్మికుల కడుపు రగిలింది. ఎ,బి షిఫ్టులవారు ఆ రాత్రంతా ఇళ్ళకు వెళ్ళకుండా కంపెనీ ముందు బైఠాయించారు. మేనేజ్‌మెంటువారు తాగునీరు ఇవ్వకపోయినా, లైట్లు ఆపివేసినా పోరాటం చేయడం వలన బ్రాండిక్స్ యాజమాన్యం, ఆర్‌డివో లిఖితపూర్వకంగా 10 వేల జీతం, 15 రోజుల తదుపరి 30-4-16 డ్యూటీకి హాజరవ్వాలని హామీ ఇచ్చారు. ఇది జరిగిన రెండవరోజు బెంగుళూరులోని టెక్స్‌టైల్ మహిళాకార్మికులు పెద్దఎత్తున పోరాటం చేశారు. ఈ పోరాటం ఫలితంగా పాత పద్ధతిలోనే పిఎఫ్‌ను కొనసాగించాలని ప్రకటించారు.

ఈలోపు బ్రాండిక్స్ మేనేజ్‌మెంట్, కలెక్టరు, డ్వామా పీడీ మీటింగు పెట్టి 25 నుండే డ్యూటీకి రావాలని కార్మికులకు మెసేజ్‌లు పంపించటం జరిగింది, 25వ తేదీన ఉద్యోగానికి రాకపోతే కంపెనీ ఎత్తివేస్తామని బెదిరించి సర్వశక్తులు వొడ్డి డ్వాక్రా మహిళలను రంగంలోకి దింపి కొద్దిమందిని కంపెనీకి రప్పించుకోవటం జరిగింది.

డ్యూటీకి వచ్చినవారితో పోలీసుల పహారాతో పనిచేయించుకునే పరిస్థితి ఏర్పడింది. 30 వ తారీకు వందలాది మహిళలను అచ్యుతాపురం సెంటరులోనే అరెస్టులు చేసి భయభ్రాంతులకు గురిచేసారు. కార్మికులు చేసిన నేరమేమిటి? పిఎఫ్ అడగటం నేరమా? జీతం అడగడం వాళ్ళు చేసిన నేరమా?

**ప్రభుత్వ వైఖరి** :కలెక్టరు, పోలీసులు, సెజ్ అధికారులు కంపెనీ యాజమాన్యాలకు మద్దతుగా వ్యవహరించారు. స్థానిక ప్రజాప్రతినిధులు కార్మికులను పట్టించుకోలేదు. మేడే ఉత్సవాలు పేరుకుమాత్రమేనని తమ మద్దతు యాజమాన్యాలకేనని మరోసారి ప్రభుత్వం రుజువు చేసికొంది.

**ఉద్యమ స్ఫూర్తి** : బ్రాండెక్స్ కార్మికులకు ఒక యూనియన్ లేదు, నాయకుడు లేడు. అయినా పోరాడారు. అలాగే బ్రాండెక్స్ యాజమాన్యం ఎంత నిర్బంధాన్ని ప్రయోగించినా పోరాటాన్ని అపలేకపోయారు. తమ పోరాటంతో పిఎఫ్ గతంలో మాదిరిగానే కేంద్రప్రభుత్వం చెప్పాల్సివచ్చింది. ఈ ఆందోళన తరువాత పని పరిస్థితులు మెరుగయ్యేందుకు మూడు కమిటీలను ఏర్పాటు చేశారు. ఫిర్యాదుల స్వీకరణకు సిద్ధమయ్యారు.

పోలీసులు మహిళలను మధ్యలోనే అరెస్టు చేసి పోలీసు స్టేషనుకు తీసుకువెళ్ళడాన్ని అరెస్టయిన మహిళలు తీవ్రంగా ప్రతిఘటించారు. సాయంత్రంవరకు వాహనాలలోనుండి కిందికి దిగడానికి నిరాకరించారు. మగపోలీసులే లాగడము, గుంజడము వంటి చర్యలు తప్పని నిలదీశారు. యాజమాన్యము తమ నోళ్ళు మూయించడానికి పోలీసులకు కోట్ల రూపాయలు కట్టబెట్టిందని మనమధ్య మూడవ వాళ్ళు ఎందుకని ప్రశ్నించే యాజమాన్యం పోలీసులను ఎందుకుతెచ్చిందని ఇది ఏమి నీతని ప్రశ్నించారు.

మహిళా కార్మికుల పోరాటానికి గ్రామ ప్రజల మద్ధతు సంపూర్ణంగా లభించింది. సి.ఐ.టి.యు, ఐద్వా వారికి అండదండలు ఇచ్చి ఆసరాగా నిలబడింది. బానిస చాకిరీకి చరమగీతం పలికే ఉద్యమాలకు ఇది ప్రారంభం మాత్రమే.



# అలరించిన మహిళల ఉగాది కవితా గానం

**-డాక్టర్ యం. ప్రగతి**

అనంతపురంలో మహిళలకు ఉగాది ఒకరోజు ముందే వచ్చేసింది. అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) అనంతపురం జిల్లా కమిటీ ఉగాది సందర్భంగా ఈ నెల 7వ తేదీ మహిళా రచయితల సమావేశాన్ని ఏర్పాటు చేసి, మహిళల కవితా గానాన్ని నిర్వహించింది. ఈకవి సమ్మేళనంలో 12 మంది కవయిత్రులు తమ స్వీయ కవితలను వినిపించారు.

ఉగాది నాటి వసంతం గత కాలపు జ్ఞాపకమేనంటూ డాక్టర్ పాణ్యం వసుంధర గారు అలనాటి ఉగాది "మావి చివురులు మేసి మత్తెక్కి కూసే మరి ఈనాడు...."కణకణ మండే నిప్పుకణిక వలె - భగభగ మండెను వాతావరణం - రివ్వున తారాజువ్వ విధాన - పైపై కెగసెను ద్రవ్యోల్బణం - కాలుష్యపు కోరలలో పర్యావరణం - బడుగు గుండెలో రేగెను బడబానలం.." అంటూనే కొత్త వత్సరానికి స్వాగతం పలికారు. ఆచార్య దేవకి గారు దుర్ముఖి నామాన్ని మారుస్తామంటూ . "జీవితమంటే.... చెండు మల్లెల గుండు మల్లెల పానుపు కాదనీ పరీక్షల్లో తప్పినందుకు, ఉద్యోగం రానందుకు - బలవన్మరణానికి ఒడి కట్టి - కన్న వారికి కడుపుకోత మిగల్చొద్దని - యువతకు విడమరిచి వివరించు" అప్పుడు నీ పేరు మార్చుతామని దుర్ముఖి సమ్ముఖానికి విన్నవించారు. మండే ఎండలు, పెరిగే ధరల నేపథ్యంలో ఉగాది ఎలా జరుపుకోవాలని ప్రశ్నించారు శ్రీమతి బాలభారతి తన కవితలో .

శ్రీమతి విద్యారాణి తన చిన్ననాటి ఉగాదిని గుర్తు చేసుకుంటూ "నాడు మా అమ్మ వేకువనే తలంటి, కొత్త బట్టలు తొడిగి - భుజనంబులు మెచ్చు భోజనంబులు అందరికి వండి వడ్డించేది - అక్కచెల్లెళ్ళ అనురాగాలు, బాబాయిల గారాలతో ఉగాది సందడే సందడి" మరి నేడు "పిల్లలు అమెరికాలో, అమ్మానాన్నలు ఇక్కడ ఒంటరి బందిఖానాల్లో గంగాదేవి తన "సువర్ణ ఉగాది" కవితలో. "నీలి గగనాన తారాజువ్వలా - ఆకాశమే హద్దుగా ఎనలేని కీర్తి కెరటంలా - అమ్మాయి ఎదగాలి" "తల్లి గర్భాలే సమాధులవని - కామాంధుల కోరల్లో నలగని - వరకట్న పిశాచం పీడించని - వంచనతో అంగడి సరుకవని - కాటుక కళ్ళు కన్నీరవని - సువర్ణలోకం కావాలని" అప్పుడే సరికొత్త ఉగాది వస్తుందని" చెప్పారు. డాక్టర్ ప్రగతి వినిపించిన కవితలో "సంఘర్షణ, సమన్వయం రథచక్రాలయితేనే సమాజ పురోగమనం" కనుక "భువిపై ఉగాదుల ఉషస్సుకు వేయి పూలు వికసించనీ - విశ్వమానవ సౌభ్రాతృత్వానికి కోటి ఆలోచనలు సంఘర్షించనీ" యమంటూ భావ ప్రకటనా స్వాతంత్రాన్ని కాంక్షిస్తున్నది.

ఉగాది, వసంతం మాత్రమే కాకుండా కొందరు యువ కవయిత్రులు మహిళలపై జరుగుతున్న దాష్టీకాలను తమ కవితల్లో నిరసించారు. కళావతి తన కవితలో "నన్ను అంతం చేయాలనుకుంటే, సాగరంలా పోటెత్తుతాను - తుఫానులా ముంచేస్తాను - అగ్నిలా కాల్చేస్తాను - తస్మాత్ జాగ్రత్త" అంటూ హెచ్చరించారు. శంకరమ్మ, "చాలా రోజుల తర్వాత మాయింట్లో అమ్మాయి పుట్టింది - నిజమైన ఆనందం పుట్టిందంటూ" కవిత్వీకరించారు. పసిపాప సందడిని కవితగా వినిపించారు. సుశీల, ధరిత్రి తల్లి ప్రేమను గుర్తు చేసుకున్నారు.

అంనతపురం జిల్లాలో మహిళా రచయితలను ఐద్వా సమావేశపరచడం ఇది రెండవసారి. గత సంవత్సరం జరిగిన సమావేశంలో రచయిత్రులు తమ రచనలతోపాటు అనుభవాలను కూడా పంచుకుని ఉత్తేజాన్ని పొందారు. మళ్లీ మళ్ళీ కలవాలనే ఆశాభావం వ్యక్తం చేశారు. ఈ సమావేశంలో పాల్గొన్న శ్రామిక మహిళా నాయకురాలు పుణ్యవతి రచయిత్రలు సమకాలీన సమాజంలోని సమస్యలను తమ రచనల్లో వస్తువుగా స్వీకరించాలని కోరారు. మహిళలపై కొనసాగుతున్న వివక్షను నిరసించడంతో తృప్తి పొంది ఆగిపోక ప్రజలలో చైతన్యాన్ని నింపే రచనలు చేయాలని పిలుపునిచ్చారు. ఐద్వా జిల్లా కార్యదర్శి సావిత్రి ఆహ్వానం పలుకుతూ అనంతపురం జిల్లా రచయిత్రలు తమ కలాలకు పదును పెట్టుకోవడంలో ఐద్వా సహకరిస్తుందని తెలిపారు.

"నిండుకున్న గాదెలన్ని నిండిన గాదెలు కాగా-నిరుపేదల బాధలను, కన్నీటి కాలువలను అత్యాచారపు వలలో ఆటల ఆర్తనాదాలను-ఏనాడంతం చేసి కట్టేస్తే సమాధి -ఆనాడే ఉగాది"అని వసుంధర గారన్నట్లు అలాంటి మంచి రోజు కోసం రచయితల బాధ్యతలను గుర్తు చేసుకుంటూ మరోసారి కలుద్దామని రచయిత్రులు సెలవు తీసుకున్నారు.

# గర్భసంచి జారిపోవడము

ఆరోగ్యం

# (యూటెరైన్ ప్రొలాప్స్) - కారణాలు- చికిత్స

డా॥ కె. భారతీసాగర్

పూర్వకాలంలో గర్భసంచి (గర్భాశయం) జారిపోమే పరిస్థితి ఎక్కువగా ఉండేది, ఎందుకంటే పూర్వం ఎక్కువ శాతం మంది మహిళలు ఆరు నుంచి ఎనిమిది మంది పిల్లల్ని, అది కూడా ఇంటిదగ్గరే ప్రసవించే వారు. ఇంటి దగ్గర ప్రసవాలను మంత్రసానులను లేదా ప్రసవ నిర్వహణలో నైపుణ్యం కలిగిన స్త్రీలను తీసుకొచ్చి ప్రసవం కానిస్తారు, కానీ అది సరికాదు, ఎందుకంటే ప్రసవం యొక్క వివిధ దశలలో వివిధ రకాలైన పరిచర్యలను చేయవలసి ఉంటుంది. అందుకే ప్రసవం గురించిన జ్ఞానం కలిగిన వైద్యులు లేదా కనీసం సహాయక వైద్య సిబ్బంది ద్వారా ప్రసవం చేయించాలి. ఇంటిదగ్గర ప్రసవం నిర్వహిస్తే చాలా రకాలైన ఉపద్రవాలు ముంచుకొస్తాయి, వాటిలో ఒకటి గర్భాశయం లేదా గర్భసంచి జారిపోవడము.

ప్రస్తుతము ఆసుపత్రులకు వచ్చి ప్రసవించే వారిసంఖ్య పెరిగింది, అందుకే గర్భాశయం జారిపోవటం లాంటి ఉపద్రవాలు తగ్గినాయి, అయినా కూడా ఇలాంటి కేసులు ఇంకా క్లినిక్స్‌కి వస్తూనే ఉన్నాయి. పూర్వకాలంలో ఇంటివద్ద ప్రసవం నిర్వహించటం వలన అనుకుంటే, ప్రస్తుత సమయంలో కొన్నిసార్లు ఆసుపత్రులలో కూడా ప్రసవాన్ని సరిగా నిర్వహించక పోవటం వలన జననాంగాలు, ముఖ్యంగా గర్భసంచి జారిపోవటము జరుగుతోంది. ప్రస్తుత ఆర్టికల్‌లో మనం ఈ విషయం గురించి తెలుసుకుంటాము.

స్త్రీ ప్రత్యుత్పత్తి అవయవాల గురించి మనకొక అవగాహన ఉంది కదా, అదే యోని, గర్భాశయం లాంటి వాటి గురించి. ఈ ప్రత్యుత్పత్తి అవయవాలు ఒక ఎముకల కుహరం (పెల్విస్)లో కండరాలు, మెత్తటి కణజాలం మధ్య సురక్షితంగా ఉంటాయి, వీటిని అదే స్థానాలలో పట్టి ఉంచటానికి వివిధ లిగమెంట్లు పనిచేస్తాయి. ఈ లిగమెంట్లలో ముఖ్యమైనవి బ్రాడ్ లిగమెంటు, వృత్తాకార లిగమెంటు, యూటెరో–శాక్రల్ లిగమెంటు మరియు ఒవేరియన్ లిగమెంటు.

అయితే ప్రసవ సమయంలో ఈ లిగమెంట్లు కొంత మెత్తగా తయారై, గర్భాశయం సంకోచ, వ్యాకోచాలు చెందడానికి వీలుగా ఉండి ప్రసవ ప్రక్రియలో సహకరిస్తాయి. అయితే ప్రసవ నిర్వహణా చూసే సిబ్బంది ప్రసవాన్ని సరిగా నిర్వహించక పోతే, అంటే గర్భాశయ సంకోచాలు లేనపుడు పొట్టపై నుంచి వత్తిడి నివ్వడం, ఫోర్ సెప్స్ లాంటి పరికరాలు ఉపయోగిస్తున్నప్పుడు సరిగా లాక్ చేయకపోవడం లాంటి వలన ఈ లిగమెంట్లు డామేజ్ అవుతాయి. దాంతో వదులుగా అయ్యి గర్భాశయం, యోని జారిపోయేలా చేస్తాయి. ఈ విధంగా గర్భసంచి, యోనినే కాకుండా ఒక్కొక్కసారి మూత్రసంచీ, లేదా పెద్దప్రేగు యొక్క చివరి భాగం కూడా జారిపోయి యోని ద్వారా వెలుపలికి రావచ్చు. అయితే గర్భసంచి జారిపోవడానికి ప్రసవం యొక్క అపసవ్య నిర్వహణ ఒక్కటే కారణం కాదు. బలహీనమైన శారీరక స్థితి వలన లేదా ఈస్ట్రోజన్ హార్మోన్ స్రావాలు తగ్గిపోవడం (ముఖ్యంగా మెనోపాజ్ దశలో), ఇంకా పొట్ట లోపలి పీడనం నిరంతరంగా పెరిగిన స్థితిలో అంటే చాలాకాలంగా ఉండే దగ్గు, బరువులు ఎత్తుతూ ఉండటం, అలాగే మెనోపాజ్ దశలో ఈస్ట్రోజన్ హార్మోన్ స్రావాలు తగ్గిపోవడం వలన లిగమెంట్లు బలహీన పడిపోయి గర్భసంచీ జారిపోతుంది.

**లక్షణాలు:**

గర్భాశయం, మూత్రాశయం లేదా మలాశయం (రెక్టమ్) కొంచెంగా జారినపుడు స్త్రీకి కొంచెం అసౌకర్యంగా ఉండటం తప్ప వేరే లక్షణాలు కనపడవు. కానీ ఎక్కువగా జారినపుడు మాత్రం ఈ క్రింది లక్షణాలు కనబడతాయి. యోనినుంచి ఏదో వెలుపలికి వచ్చినట్లుండటం లేదా జారిపోయినట్లుండటం, యోనినుంచి అధిక పరిమాణంలో తెల్లని స్రావాలు కానీ, బ్లీడింగ్ కాని అయినట్లుండటం, సంభోగ సమయంలో అసౌకర్యంగా ఉండటం, పొత్తికడుపు నుంచి ఏదో క్రిందికి లాగినట్లుండడం, మలబద్ధకం, మూత్రసంచికి ఇన్ఫెక్షన్ రావటం, అలాగే వెలుపలికి జారిన జననాంగాలపైన పుళ్ళు (డెకుబిటస్ అల్సర్) ఏర్పడటం లాంటివి కనబడతాయి.

**వ్యాధి నిర్ధారణ:**

వైద్యులు పెల్విక్ పరీక్ష చేసి తద్వారా వ్యాధిని నిర్ణయిస్తారు. గర్భాశయం కొద్దిగానే జారినపుడు యోనిలోకి స్పెకులమ్ అనే ఇన్స్ట్రుమెంట్‌ని పోనిచ్చి యోని లోపలి భాగాన్ని, గర్భాశయ

ముఖద్వారం స్థితిని పరీక్షించి తద్వారా వ్యాధి నిర్ధారణ చేస్తారు. ఈ జననాంగాలు జారిపోవటమనేది మూడు డిగ్రీలలో ఉంటుంది. వీటిని కూడా నేరుగా పరీక్షించి నిర్ధారిస్తారు.

**చికిత్స:**

మొదటి డిగ్రీ ప్రొలాప్స్ లో కీగెల్ వ్యాయామం ద్వారా, శరీర బరువుని తగ్గించటం ద్వారా, బరువులు ఎత్తటం లాంటివి నియంత్రించటం ద్వారా గర్భాశయాన్ని పూర్వపు స్థితికి తీసుకురావచ్చును. అవసరమయితె ఇఆర్‌టి (ఈస్ట్రోజెన్ హార్మోన్ రీప్లేస్మెంట్ థెరపీ) ఇవ్వవచ్చును. మొదటి డిగ్రీ ప్రొలాప్స్ (జారిపోవడం) ని ఒక చిన్న రబ్బర్ రింగు (పెసరీ) ద్వారా సరిచేయవచ్చును. అలాగే వయసు మళ్ళి, సర్జరీకి అనుకూలం కాని స్త్రీలలో కూడా ఈ పెసరీని వాడవచ్చును.

రెండవ మరియు మూడవ డిగ్రీ ప్రొలాప్స్ లలో ఆ స్త్రీ యొక్క ప్రత్యుత్పత్తిని బట్టి చికిత్స నిర్ధారిస్తారు. ఒకవేళ ఆమెకి ఇంకా సంతానం కనాలని ఉంటే జారిపోయిన భాగాలని సరిచేసి రిపేర్ చేస్తారు. (పాథర్ గిల్స్ సర్జరీ), ప్రత్యుత్పత్తి పరంగా క్రియాశీలక దశని దాటి ఉంటే గర్భసంచీని తొలగిస్తారు. ఇది రెండు విధాలుగా చేయవచ్చు. ఒకటి యోనిమార్గం నుంచి, రెండోది పొట్ట పైనుంచి కోసి తీయడం ద్వారా, అయితే ఏ ద్వారం నుంచి సర్జరీ చేయాలనేది వైద్యులు రోగి పరిస్థితిని బట్టి నిర్ణయిస్తారు.

గర్భసంచీతోపాటు కానీ లేదా సెపరేటుగా మూత్రసంచీ కానీ మలాశయం కానీ జారిపోయి ఉంటే వాటిని సర్జరీ ద్వాం చికిత్స చేయాల్సి వస్తుంది.

Note : కీగెల్ వ్యాయామాన్ని ఈ అడ్రస్‌లో http://www.wikihow.com/Do-kegel-Exercises నెట్లో చూడవచ్చును.

**నివారణ:** ఈ స్థితి తలెత్తకుండా ఉండాలంటే ప్రసవంని సరైన వైద్య నిపుణుల సమక్షంలో జరిగేలా ప్లాన్ చేసుకోవాలి. స్థూలకాయంని తగ్గించుకోవాలి. బరువులు ఎత్తడం మానుకోవాలి. మొదటి డిగ్రీలో ఉన్నప్పుడే వైద్యులను సంప్రదించి వారి సూచనల ప్రకారం వ్యాయామాలను చేయాలి.

---

కవిత

# సువర్ణ ఉగాది

-ఎస్. గంగాదేవి

వెన్నెల ప్రకాశించేలా, ప్రకృతి పులకించేలా
విరిసిన పువ్వులా, మెరిసిన తారలా
అరుణోదయ కాంతి కిరణంలా
అమ్మాయి నవ్వాలి
అవని వెలుగొందాలి
ఇల్లు ఆనంద హరివిల్లవ్వాలి
నీలిగగనాన తారాజువ్వలా
ఆకాశమే హద్దుగా
యెనలేని కీర్తి కిరీటంలా
చెదరని చిరునవ్వుతో
తరగని మమతతో
అనురాగ మూర్తిగా
అమ్మాయి ఎదగాలి
అవనిపై చిరకాలముండాలి

తల్లి గర్భాలే సమాధులవని
కామాంధుల కోరల్లో నలగని
వరకట్న పిశాచం పీడించని
వంచనతో అంగడి సరుకవని
కాటుక కళ్ళు కన్నీరవని
సువర్ణలోకం కావాలి
సుకుమారి శోకం తీరాలి అప్పుడే...
ఈ మానవ చరిత్రకు
వెలుగు రేఖల తోరణాలతో
సరికొత్త ఉగాది వస్తుంది
మానవత్వం పరిమళిస్తుంది
ప్రతి తల్లీ పరవశిస్తుంది
భరతమాత పులకిస్తుంది.

## (చట్టాలు) సమాన వేతన చట్టం, 1976

-ఆర్. దుర్గాప్రసన్న, అడ్వకేట్

స్త్రీలు సున్నిత మనస్కులు. వారి మనసేకాదు వారి శరీరం కూడా సున్నితమే. స్త్రీ సున్నితత్వాన్ని అనేక మంది కవులు వర్ణించడం మనకు తెలుసు. కష్టమైన, క్లిష్టమైన పనులన్నీ పురుషులే చేస్తూవుంటారు. పురుషుడు బాహుబలం, భుజబలం కలిగి వుండాలని, కుటుంబాన్ని సంరక్షించవలసిన భాధ్యత, పోషించవలసిన భాధ్యత కూడా పురుషునిదే. అందుకే ఉద్యోగం పురుష లక్షణం అన్నారు. మారుతున్న కాలంతోపాటు మనుష్యులు వారి యొక్క జీవనశైలి మార్పుచెందుతూ వచ్చింది. ఇంటిని, పిల్లల సంరక్షణకూ మాత్రమే పరిమితమైన స్త్రీ చదువు, ఉద్యోగమూ, వ్యాపారమూ అంటూ అనేక రంగాలలో తనదైన శైలితో పురుషులతో పోటీపడి, పురుషులకు దీటుగా ముందుకు సాగుతూంది నేడు. 'ముదితల్ నేర్వగరానిదే ముద్దార నేర్పింపగన్' అనుకున్న, వేన్నీళ్ళకు చన్నీళ్ళుతోడు అన్న మరేమనుకున్నా దేశ అభివృద్ధిలోనూ తలసరి ఆదాయంలోనూ స్త్రీ శ్రమ గణనీయంగా పెరిగింది. ఆడపిల్ల ఉద్యోగాలు చేయాలా? ఊళ్ళేలాలా? అనే స్థాయిని దాటి నేడు స్త్రీలు ఉద్యోగాలూ చేస్తున్నారు. ఊళ్ళు ఏలుతున్నారు. పురుషులతోపాటు వారూ సంపాదిస్తున్నారు. ఇప్పటికీ ప్రపంచంలో అనేక దేశాలు స్త్రీలకు సమాన అవకాశాలనే కాదు సమాన వేతనాలూ ఇవ్వడం లేదు అనే విషయం మనలో చాలా మందికి తెలుసు. ఇక మనదేశంలో కూడా ఫ్యాక్టరీల్లోనూ, వ్యవసాయ రంగంలోనూ పనిచేసే స్త్రీలకు పురుషులకంటే తక్కువ వేతనాలు ఇవ్వడం పరిపాటి. స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగం స్త్రీ పురుష వివక్ష లేకుండా సమాన విద్య, సమాన ఉద్యోగ అవకాశాలను కల్పించినప్పటికీ పురుషులు బలశాలి కాబట్టీ ఎక్కువ పని చేస్తాడని, ఎక్కువ వేతనం ఇచ్చి స్త్రీలకు తక్కువ వేతనం చెల్లించేవారు. ఫ్యాక్టరీలలో స్త్రీ పురుషులు సమానమైన పనులు చేస్తున్నప్పుడు, సమానమైన పనివేళలు పాటిస్తున్నప్పుడు వారికి జీతభత్యాలలో వ్యత్యాసం వుండేది. భారత రాజ్యాంగంలోని 39వ ఆర్టికల్ ప్రకారం "సమానమైన పనికి సమానవేతనం" స్త్రీ పురుష లింగ వివక్ష లేకుండా అనే సూత్రానికి కట్టుబడి 1976వ సం॥లో (Equal Remuneration Act, 1976) సమాన వేతన చట్టం తీసుకురాబడింది.

Sec 5: పనిచేయించుకునే Employer ఏ వ్యవస్థలోనైనా ఉద్యోగాలిచ్చేటపుడు స్త్రీ పురుష వివక్షని చూపకుండా, స్త్రీలకు ఉద్యోగాలనివ్వడమే కాకుండా సమానమైన పనికి సమానవేతనం చెల్లించాలి.

Sec.15. ప్రకారం స్త్రీ గర్భందాల్చి శిశువుకి జన్మనిచ్చే సమయంలో కొంత వెసులుబాటును కల్పించాలి.

అంతేకాదు ఆడమగ అనే లింగవివక్ష లేకుండా ఉద్యోగభర్తీని చేపట్టడమే కాక ఉద్యోగంలో ఉన్న సమయంలో Promotion (ఉన్నతి), Training (వృత్తి ఉద్యోగపరమైన నైపుణ్యాలకు తర్ఫీదు) మరియు Transfer (బదిలీ)లను ఒకే విధమైన పనికి ఒకే విధంగా నిర్వహించాలి.

Sec. 8 ప్రకారం రిజిస్టర్‌ను తయారు చేసి worker, ఉద్యోగుల వివరాలను నమోదు చేయాలి. worker వివరాలను ఎప్పటికప్పుడు Employer నమోదు చేస్తూ ఉండాలి. అందులో ఉద్యోగంలో ఎప్పుడు చేరింది., ఎక్కడ చేరింది మొదలగు వివరాలతో పాటు ఉద్యోగుల వివరాలు, వేతనములు, మినహాయింపులు (Deductions from Wages), జీతభత్యముల యొక్క రశీదులు మున్నగు వాటిని కూడా నమోదు చేయాలి.

Sec. 25.A ప్రకారం ఉద్యోగులు ఎవరైనా బాధ్యతల్లో ఉండగా మరణించినపుడు చెల్లించకుండా ఉండిన వేతనం వారియొక్క 'నామినీ' కి గానీ వారసులకు గానీ చెల్లించాలి.

ఈనాడు చట్టం ప్రకారం ఫ్యాక్టరీలు, Shop and Establishments, అన్ని ప్రభుత్వ ప్రయివేటు రంగాలలోనూ స్త్రీ పురుషులకు సమాన అవకాశాలు సమాన వేతనాలు ఉన్నాయి. వ్యవసాయ రంగంలోనూ, నిర్మాణ రంగంలోనూ ఇప్పటికీ ఈ తేడా కొనసాగుతున్నది. మిగిలిన అన్ని రంగాలలోనూ స్త్రీలు పురుషులతోపాటు సమానమైన పనికి సమానవేతనాన్ని పొందుతున్నారు. కానీ స్త్రీలు ఎక్కువగా చేసే పనులకు వేతనాలు నిర్ణయించడంలోనే వివక్షత కొనసాగుతుంది.

స్త్రీలు అన్ని రంగాలలోనూ ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి ఈ చట్టం కొంత వరకైనా దోహదపడింది. ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలు పురుషులతో సమాన హక్కుల కోసం ఇంకా ఉద్యమిస్తూనే ఉన్నారు. విద్యా, ఉద్యోగ రంగాలలోనూ, వ్యాపార రంగంలో ఏ విధమైన లింగవివక్ష లేనపుడు మాత్రమే స్త్రీలు ఆర్థికంగా, సామాజికంగా నిలదొక్కుకోగలుగుతారు. ఎవరికైనా వారికాళ్ళపై వారు నిలబడినపుడే కదా ఆత్మవిశ్వాసం ఉండేది. ఆత్మవిశ్వాసమే కదా మనిషిని అన్ని రంగాల్లోనూ విజయపథంవైపు నడిపించేది. స్త్రీల అభ్యున్నతి కొరకు ఏర్పడిన ఈ చట్టం 1976 లో అమల్లోకి వచ్చినప్పటికీ 1987లో అవసరమైన సవరణలతో అమలులో ఉంది. మొదట ఫ్యాక్టరీల్లో పనిచేసే వారికొరకు ఏర్పాటు చేసినా తదనంతర కాలంలో అనేక రంగాలకు విస్తరించి స్త్రీలకు ఉద్యోగాల్లో పురుషులతో సమాన అవకాశాలనూ, సమాన వేతనాన్ని అందించేందుకు దోహదపడుతుంది.



కథ

# ఇది కథ కాదు

- పి. సుప్రజ

గేటు తీసిన చప్పుడు అవడంతో బయటకు వచ్చిన సుశీలకి లోపలికి వస్తున్న తన చిన్ననాటి స్నేహితురాలు సునందను చూడగానే చాలా సంతోషంతో రావే సునందా ఎంతకాలమైందే నిన్ను చూసి ఇప్పటికి గుర్తొకొచ్చానా అంటూ స్నేహితురాలితో నిష్ఠూరం ఆడింది సుశీల. అలా అనకే సుశీ నీకన్నా మనసు విప్పి మాట్లాడుకునే స్నేహితులు నాకెవరున్నారే, నీకు తెలుసుకదా నాది బండెడు సంసారం. బండచాకిరి అవన్నీ చక్కమెట్టుకునే సరికి నా తలప్రాణం తోకకొస్తుంది. అయినా ఎవర్నీ తృప్తి పరచలేకపోతున్నానే సుశీలా అదే నాబాధ. ఇంటి పని, బయట ఆఫీసులో పని నా శక్తికి మించి చేస్తునే ఉన్నా నన్ను అర్థం చేసుకొనేవాళ్ళే లేరు. పైగా ఆపని ఎందుకు అలా చేసావు.

ఈ పని ఎందుకు ఇలా చేశావూ అనే సూటీపోటీ మాటలు. నాకు మనసేమీ బాగాలేదు అంటే ఊహల్లో ఉండొద్దు వాస్తవంలో ఉండు ఎప్పుడూ నెగెటివ్ ఆలోచన లేదా పాజిటివ్‌గా ఆలోచించలేవా అంటాడే నాభర్త ఆయన పనులు ఆయనవి నాగురించి ఆలోచించే తీరికెక్కడుంది. పిల్లలతో మాట్లాడబోతే నీకు పిచ్చి పట్టింది. పిచ్చి పిచ్చిగా మాట్లాడతావు అమ్మా ఇప్పుడు నీకేమి తక్కువయ్యింది అంటారు వాళ్ళ ఆలోచనలు వాళ్ళవి. కనీసం మా అమ్మైనా నాగురించి పట్టించుకుంటుందేమో అనుకుంటే నీకేమి తక్కువ చక్కటి పిల్లలు సంపాదించిపెట్టే భర్త నువ్వూ ఉద్యోగం చేసి ఎంతో కొంత సంపాదించుకొంటున్నావు గదా ఇంకా నీకేమి కావాలి అంటుంది. ఆమె డబ్బు లెక్కలు ఆమెవి డబ్బుతోనే సుఖం అంటుంది. డబ్బుంటే ఇంకేమీ అవసరం లేదంటుంది కనీసం మా అమ్మ దగ్గర్నుంచైనా ఏమ్మా ఎందుకు బాధపడుతున్నావు ఏం కావాలి నీకు అని ప్రేమగా అడిగితే మా అమ్మ ఒడిలో తలపెట్టుకొని సేదతీరాలని నా కోరిక కాని అది నా విషయంలో అత్యాశే అవుతుంది.

ఈ ప్రపంచంలో ఏ జీవికైనా కన్నవాళ్ళ తర్వాతే ఎవరైనా, అటువంటిది వాళ్ళ నిర్లక్ష్యానికి గురయితే మనసు పడే వేదన వర్ణించనలవిగానిది. ఎంత డబ్బుండీ ఏం లాభం ఏదో సంపాదించుకుంటున్నాం. వండుకొని తింటున్నాం. పడుకుంటున్నాం ఇంతేనా జీవితం అంటే ?ఇంకేమీ లేదా? ఏదో లక్ష్యం అంటూ లేని జీవితం వృధా అనిపిస్తుంది సుశీలా ఏదో ఒకటి చెయ్యాలి. ఏం చెయ్యాలో తెలియదు ఏదో అశాంతి పిచ్చి పిచ్చి ఆలోచనలు ఊపిరి ఆడనియ్యడం లేదు సుశీలా. ఒక్కోసారి నావల్ల ఎవరికీ ఉపయోగం లేదు భూమికి భారం తప్ప చనిపోతే బాగుంటుందనిపిస్తుంది సుశీలా. చాల్లే నోర్మూయ్ సునందా ఇప్పటిదాకా నువ్వేదో చెపుతున్నావు మధ్యలో మాట్లాడడమెందుకని వింటూ కూర్చున్నాను ఏమిటీ నీ బాధ ఏమిటి ఎవరికంటే గొప్పదానివి నువ్వు ఓ నేనొక్కదాన్నే కష్టపడిపోతున్నానని తెగ బాధపడిపోతున్నావు. ఆడదానివై పుట్టిన తరువాత ఆ మాత్రం లోకం పోకడ తెలియకుండా బాధపడిపోతావా చక్రవర్తి శ్రీరామ చంద్రుడి భార్య అయిన సీతకే తప్పలేదే బాధలు ఆమెని ఎవరు అర్థం చేసుకొన్నారు. ఆమె మనసెరిగి ఎవరు ఆమెని ఓదార్చారు. జనక మహారాజు కూతురై పుట్టి దశరధమహారాజు కోడలై ఎన్ని కష్టాలు పడ్డది.

అరణ్యవాసానికి బయలుదేరిన రామునికి తోడుగా ఉండాలని లక్ష్మణుడు బయలుదేరాడే గాని అతని భార్య ఊర్మిళ గురించి ఏమైనా ఆలోచించాడా? అపురూపమైన అన్నదమ్ములు అని కీర్తి గడించారు గాని వాళ్ళనే నమ్ముకుని వచ్చిన వాళ్ళ భార్యల గురించి పట్టించుకొన్నారా? వాళ్ళ మనసెరిగి ప్రవర్తించారా. రావణుడి చెరలో ఉన్న సీత అహోరాత్రులు రామానామం మరవకుండా రామచంద్రుడి కోసం తపించిపోయిందే, అటువంటి సీతమ్మను రాముడు అగ్నిప్రవేశం చేయమన్నాడు.

ఆడదానివై పుట్టిన తరువాత ఆ మాత్రం లోకం పోకడ తెలియకుండా బాధపడిపోతావా చక్రవర్తి శ్రీరామ చంద్రుడి భార్య అయిన సీతకే తప్పలేదే బాధలు ఆమెని ఎవరు అర్థం చేసుకొన్నారు. ఆమె మనసెరిగి ఎవరు ఆమెని ఓదార్చారు. జనక మహారాజు కూతురై పుట్టి దశరధమహారాజు కోడలై ఎన్ని కష్టాలు పడ్డది. అరణ్యవాసానికి బయలుదేరిన రామునికి తోడుగా ఉండాలని లక్ష్మణుడు బయలుదేరాడే గాని అతని భార్య ఊర్మిళ గురించి ఏమైనా ఆలోచించాడా? అపురూపమైన అన్నదమ్ములు అని కీర్తి గడించారు గాని వాళ్ళనే నమ్ముకుని వచ్చిన వాళ్ళ భార్యల గురించి పట్టించుకొన్నారా? వాళ్ళ మనసెరిగి ప్రవర్తించారా. రావణుడి చెరలో ఉన్న సీత అహోరాత్రులు రామానామం మరవకుండా రామచంద్రుడి కోసం తపించిపోయిందే, అటువంటి సీతమ్మను రాముడు అగ్నిప్రవేశం చేయమన్నాడు.

తన ప్రాతివత్యాన్ని రుజువు చేసుకోమన్నాడే అప్పుడు సీత మనసు ఎంతగా బాధపడిందో గదా అది శ్రీరాముడు ఏమైనా పట్టించుకున్నాడా. ఎంతసేపూ తన పేరు ప్రతిష్ఠలు దెబ్బ తింటాయని అలోచించాడు గాని రాజ్యంలో ఎక్కడో మారుమూల ఒకచోట ఒక పనికిమాలిన వాడు అనాలోచితంగా అన్న మాటని పట్టుకొని అందరూ అదే అంటున్నారు మా సూర్యవంశం కీర్తి ప్రతిష్ఠలు దెబ్బతింటాయని ఆలోచించాడే గాని గర్భవతియైన భార్యని అడవుల పాలు చేయడం తప్పని ఆలోచించాడా? కనీసం ఆమెకు కూడా చెప్పకుండా తమ్ముడితో ఆమెను అడవులలో వదిలివేసి రమ్మని చెప్పలేదా! లక్ష్మణుడు ఆమెని అడవులలో వదిలివేసిన తరువాత ఆమె మంచి చెడ్డలేమైనా విచారించాడా! పోనీ అత్తింటివారు వేరెవరైనా అమె ఏమైందోనని పట్టించుకొన్నారా! ఆమె మంచి చెడ్డలు చూశారా, పుట్టింటివాళ్ళైనా ఆమెను ఓదార్చడానికి మేమున్నామని ముందుకు వచ్చారా. ఆ సమయంలో నిండు గర్భవతియైన సీత పడిన వేదన శివధనస్సును అవలీలగా ఎత్తగలిగిన వీరనారియై కూడా అడవులలో ఆమె చేసిన ఆక్రందన ఆమె అనుభవించిన మానసిక క్షోభ శ్రీరాముడు గుర్తించాడా? పుట్టింటివాళ్ళైనా, అత్తింటివాళ్ళైనా ఆమె మనసులో ఏముందో తెలుసుకోవడానికి ప్రయత్నించారా? ఆమె మనసెరిగి ప్రవర్తించారా ఓ మహారాజు కూతురై పుట్టి చక్రవర్తిని చేపట్టిన సీత మనసుకే గుర్తింపు లేదు.

మనమెంత సామాన్యులం నన్ను పట్టించుకోవడం లేదు నామాటకు విలువ లేదు అని బాధపడడానికి సర్లే ఇవి ఎప్పుడూ ఉండేవే కాని మొహం కడుక్కొని రా భోజనం వడ్డిస్తా, భోంచేసి షాపింగ్‌కి వెళ్దాం. అంతకంటే మనం చేయగలిగింది ఏముందిలే అనుకుంటూ సుశీల, సునంద ఇద్దరూ పైకి లేచారు. ఇంతలో కాలింగ్ బెల్ శబ్దం వినిపించడంతో ఇప్పుడెవరై ఉంటారా అనుకుంటూ తలుపు తీసిన సుశీలకి రమ్య, స్నేహ నవ్వుతూ కనిపించారు. రండి, రండి అని లోపలికి ఆహ్వానించింది సుశీల. లోపల ఉన్న సునందను చూడగానే రమ్య ఏ సునందా నువ్వెప్పుడొచ్చావే అనుకోకుండా భలే కలిసామే అంటూ ఈమె పేరు స్నేహ నా స్నేహితురాలు మహిళాసంఘం కార్యకర్త అంటూ పరిచయం చేసింది. సుశీల. సునంద, రమ్య చిన్ననాటి స్నేహితులు ముగ్గురూ కబుర్లలో పడ్డారు. వారి ఆనందాన్ని చూస్తూ స్నేహ అలా కూర్చుండిపోయింది. ఉన్నట్టుండి సుశీల, రమ్యను చూస్తూ ఏమిటే రమ్యా నీలో ఇంతమార్పు ఎప్పుడూ నిరాశా, నిస్పృహలతో వేదాంతం

**నిండు గర్భవతియైన సీత పడిన వేదన శివధనస్సును అవలీలగా ఎత్తగలిగిన వీరనారియై కూడా అడవులలో ఆమె చేసిన ఆక్రందన ఆమె అనుభవించిన మానసిక క్షోభ శ్రీరాముడు గుర్తించాడా? పుట్టింటివాళ్ళైనా, అత్తింటివాళ్ళైనా ఆమె మనసులో ఏముందో తెలుసుకోవడానికి ప్రయత్నించారా? ఆమె మనసెరిగి ప్రవర్తించారా ఓ మహారాజు కూతురై పుట్టి చక్రవర్తిని చేపట్టిన సీత మనసుకే గుర్తింపు లేదు.**

మాట్లాడేదానివి ఎదుటివాళ్ళకు నీరసం వచ్చేటట్టు. ఇప్పుడేమో తియ్యగా మాట్లాడుతూ ఎదుటివాళ్ళను కట్టిపడేస్తున్నావు. ఏమిటి నీమాట తీరులో అంత మార్పు అసలు నేను మాట్లాడుతున్నది మా రమ్యతోనేనా? నిజమే సుశీ నువ్వన్నట్టు నాలో ఈమార్పుకు కారణం నా ఫ్రెండు స్నేహ. ఈమెతో పరిచయం నా అదృష్టం.

సమస్యలు లేకపోవడమే ఒక సమస్య అని నేను తెలుసుకొనేలా చేసింది. ఎందరో బాధిత మహిళల జీవితాలను దగ్గరగా చూసేటట్టు చేసింది. వారిలో మానసిక ధైర్యాన్ని నింపి భవిష్యత్తు పట్ల ఆశతో ఎలా జీవించాలో అని మహిళాసంఘం తరపున అటువంటి మహిళల కోసం ఎన్ని సామాజిక సేవాకార్యక్రమాలు చేస్తున్నారో చూపింది. నావంతు కృషి మహిళల కోసం ఏం చేయాలో నేర్పింది. ఇప్పుడసలు తీరికే ఉండటం లేదు. పిచ్చి పిచ్చి ఆలోచనలకు తావే లేదు. అందుకే చాలా సంతోషంగా ఉన్నాను. సుశీ ఏదైనా మనం అనుకునే దాన్లోనే ఉంటుంది. మనం జీవితాన్ని ఏ కోణం నుంచి చూస్తే అదే కనిపిస్తుంది. మన ఆలోచనల్లోనే ఉంది అంతా, నిజమే రమ్యా అని ఒకేసారి సుశీల, సునంద ఇద్దరూ అన్నారు. రమ్య ఇక వెళ్దామా అంది స్నేహ.

కాసేపు ఉండొచ్చు కదా ఇప్పుడే కదా వచ్చారు అంది సునంద. లేదు సునందా అధిక ధరలు తగ్గించాలని ప్రభుత్వం మీద ఏవిధంగా ఒత్తిడి తేవాలో మహిళా సంఘం సభ్యులతో చర్చించి వారి అభిప్రాయాలను తెలుసుకొని పెద్ద ఎత్తున ఒక కార్యక్రమాన్ని జరపాలని నిర్ణయించుకొన్నాం. ఆ విషయం మాట్లాడడానికి వెళ్ళాలి మరోసారి వస్తాం. మీకు వీలైతే ఒకసారి మహిళాసంఘం ఆఫీసుకు రండి అని రమ్య, స్నేహ ఇద్దరూ బయలుదేరారు. తమ ఆవేదన తీరే మార్గం దొరికిందని ఆలోచిస్తూ వాళ్ళు వెళ్ళిన వైపే చూస్తుండిపోయారు సుశీల, సునంద.

వ్యాసం

# పోరాటానికి ప్రతీక మహిళ

-ఎం. నాగమణి



మహిళ అనే ఈ మూడక్షరాలు పోరాటానికి ప్రతీకలు. సమాజంలో తల్లి, చెల్లి, భార్యగా ఆమె బాధ్యత అద్భుతమైనది. అనిర్వచనీయమైనది. ఆలూమగలు, తల్లిదండ్రులు, భార్యాభర్తలు, గురువూ దైవం ఇలా ప్రతీ అంశంలోను మహిళదే ప్రథమ స్థానం. అటువంటి మహిళ నేడు సమాజంలో ఎంతవరకు గౌరవం పొందగలుగుతోందీ అని ప్రశ్నించుకుంటే అది ప్రశ్నగానే మిగిలిపోతుంది. తల్లి గర్భంలో శిశువుగా రూపొందింది మొదలు జన్మించటానికి పోరాటం, పుట్టాక జీవించటానికి పోరాటం, తరువాత మనుగడ కోసం పోరాటం, తన అస్తిత్వాన్ని నిలబెట్టు కోవటానికి పోరాటం... ఇలా జీవితమే ఒక పోరాటంలా మారిపోయింది. ఈ పుడమిపై స్త్రీ తన మనుగడ కోసం చేసే పోరాటంలో సామాజిక హక్కుల కోసం, సమానత్వం కోసం నిరంతరం పోరాడుతూనే వుంది. ఏదైనా ఉద్యమం పుడితే అది స్త్రీతోనే మొదలవుతుంది. స్త్రీతోనే సఫలమవుతుంది. అంతులేని వివక్షకు గురవుతున్న మహిళ మరెంతోమంది మహిళల్ని కూడగట్టి మహిళా సంఘాలను ఏర్పాటు చేసింది. పురుషులతోపాటు సమాన హక్కులు కావాలంటూ మహిళా సంఘాలు దశాబ్దాల కాలం నుండీ పోరాటాలు చేస్తూనే వున్నాయి. చట్టసభలలో 33 శాతం రిజర్వేషన్లు కల్పించాలని ఉద్యమాలు చేస్తున్నాయి. కానీ ఈ బిల్లు పార్లమెంట్ కోల్డ్ స్టోరేజ్‌లోనే దశాబ్దాల తరబడి మగ్గిపోతోంది. ఇది ఇలా ఎన్నాళ్లపాటు కొనసాగుతుందో రాజకీయ విశ్లేషకులు సైతం చెప్పలేని పరిస్థితి. అదేమంటే వారి రాజకీయ మనుగడకు ఈ బిల్లు ఎక్కడ విఘాతం కలిగిస్తుందోనని రాజకీయ దురంధరులు హడలిపోతున్నారు.

భారత స్త్రీ నాలుగు గోడల మధ్యనే వుంటూ మగవారి శ్రేయస్సుకోసం పూజలు పునస్కారాలు చేసుకుంటూ హైందవ స్త్రీగా వుండాలని వారి అభిప్రాయం. స్త్రీలు హైందవ సంప్రదాయం ప్రకారమే నడవాలని కోరుకునే ఈ పురుష పుంగవులు కొన్ని దేవాలయాలలోకి మహిళలు ప్రవేశం చకూడదని ఎందుకు నిబంధనలు పెడుతున్నారు? మహిళా పోరాటాల ఫలితంగా దక్కించుకున్న ఆలయ ప్రవేశాలను ఎందుకు తప్పు పడుతున్నారు? ఎందుకు గింజుకుంటున్నారు? పురాణాల ప్రకారం స్త్రీ అంటే ఆదిశక్తితో సమానం.

మరి అటువంటి ఆదిశక్తికి అన్ని దేవాలయాల్లోకి ఎందుకు ప్రవేశం లేదు? దీనికి వీరివద్ద ఎటువంటి సమాధానం వుండదు. ఇప్పుడు ఈ అంశంపైనే భారత అత్యున్నత న్యాయస్థానం సైతం స్పందించింది. 'చట్టాలకంటే సంప్రదాయాలు గొప్పవి కావు' అంటూ ఈ మధ్యనే సుప్రీంకోర్టు సంచలన వ్యాఖ్య చేసింది. ఇది మహిళా లోకం ఆహ్వానించదగిన వ్యాఖ్య. శనీశ్వర దేవాలయం లోనికి మహిళలకు ప్రవేశం కల్పించాలని బొంబాయి హై కోర్టు ఆదేశాలు జారీ చేసింది. ఈ నేపథ్యంలో మహారాష్ట్రలోని ప్రముఖ పుణ్యక్షేత్రమయిన షిర్డీకి అతి సమీపంలో వున్న శనీశ్వరుని దేవాలయం ట్రస్ట్ పోరాట ఫలితంగా మహిళలకు ఆలయ ప్రవేశం కల్పించింది. ఈ అంశంపై ఆధ్యాత్మిక వేత్తలుగా చలామణి అయ్యే కొందరు అవాకులు చవాకులు పేలారు. దేశవ్యాప్తంగా సంచలనం కలిగించిన నిర్భయ అత్యాచార ఘటనలో కూడా స్వామీ స్వరూపానంద మహిళలను కించపరుస్తూ పలు వ్యాఖ్యలు చేశాడు.'అసలు అమ్మాయిలు అర్థరాత్రివేళ రోడ్లపై తిరగవలసిన పనేమిటనీ... అత్యాచారం చేయటానికి ప్రయత్నించిన వారిని అన్నయ్యా అని సంబోధిస్తే వారు అత్యాచారానికి పాల్పడేవారు కాదనీ, ఇలా నోటికి వచ్చినట్లుగా పేలారు. కరడుకట్టిన మత ఛాందసవాదానికి ప్రతీకలుగా వీరి వ్యాఖ్యలు మహిళల మనోభావాలను ఘోరంగా అవమానించాయి. ఈ సంకుచిత ఆలోచనతో తిరోగమనంలో నడుస్తున్నారు. ఆధ్యాత్మికవేత్తలంటే లింగబేధాలకు అతీతంగా మనిషిని మనిషిగా గుర్తించటమని ఈ మూర్ఖులు ఎప్పటికి తెలుసుకుంటారో కదా! శనీశ్వరాలయంలోనికి ప్రవేశించిన మహిళలను ఉద్దేశించి కూడా స్వరూపానంద స్వాములవారు మరికొంత ముందుకు వెళ్ళి వారి సహజసిద్ధమైన మూర్ఖత్వాన్ని చాటుకున్నారు. ఆలయ ప్రవేశం చేసి 'మహిళలు వారిపై వారే అత్యాచారాలను ప్రోత్సహించు కుంటున్నార'ని వ్యాఖ్యానించాడు. ఇది వారు ప్రత్యేకించి రాసుకున్న ధర్మశాస్త్రంలో వుంది కాబోలు. ఇటువంటి మత ఛాందసులను చూసి సదరు మహిళలంతా ఆగ్రహించాలి. కాని వారి మాటలను శిరోధార్యంగా భావించే వారి మూర్ఖత్వానికి జాలిపడాలి. ఎందుకంటే ఎటువంటి నైతిక విలువలు లేని పొగరు బోతులకు మహిళలు తమ విలువైన సమయాన్ని వెచ్చించటం కూడా శుద్ధ అనవసరం.

**ఇదే బాటలో మరికొన్ని పురాతన దేవాలయాలు..**

గోదావరి జన్మస్థానం, ద్వాదశ జ్యోతిర్లింగాలలో అతి ముఖ్యమైనదైన త్రయంబకేశ్వరాలయంలోకి కూడా మహిళలకు ప్రవేశం కల్పిస్తూ..ఆ దేవాలయం ట్రస్ట్ మహిళామణులకు ఆలయ ద్వారాలను తెరిచింది. కాకపోతే ఇక్కడ షరతులతో కూడిన ప్రవేశాన్ని కల్పించింది. సంప్రదాయ దుస్తులు వేసుకుని తడి బట్టలతో మాత్రమే దేవాలయంలోనికి రావాలని షరతు విధించింది. దీనిపై మహిళా లోకం వ్యతిరేకతను వ్యక్తం చేసింది. ఏది ఏమైనా ... దశాబ్దాల కాలంగా మహిళలు చేస్తున్న పోరాటాల ఫలితంగా కలిగిన విజయంగా చెప్పుకోవచ్చు. ఇన్ని శతాబ్దాలుగా రాని మార్పు మహిళల పోరాటంతోనే ఇది సాధ్యపడిందని భావించవచ్చు. మరికొంతకాలం తరువాత ఈ నిబంధన కూడా కాలగర్భంలో కలిసిపోవచ్చు. ఎందుకంటే మార్పు అనేది కాలానుగుణంగా..పోరాటాల ఫలితంగా దక్కుతుంది అనుకోవటానికి ఇది ఒక చక్కని ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఇస్లాం మతంలో కూడా స్త్రీని బానిస కంటే హీనంగా చూస్తారు. అటువంటి ఇస్లాం మతస్తులు కొలిచే మసీదులో కూడా ఇటీవల మహిళలకు ప్రవేశాన్ని కల్పించారు. ఇది కూడా మహిళా లోకం పోరాడి సాధించుకున్న విజయంగా మనం గమనించాలి.

# (కేస్ స్టడీ) నాకు దారి చూపించండి మేడమ్ - కె.శారద

'మేడమ్! నాకేదైనా దారి చూపించండి. నేనెలా జీవించను?' అని ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చిన 35ఏళ్ళ యువతి అడిగింది. నువ్వెవరమ్మా? ఎక్కడనుండి వచ్చావు? నీ పేరు, నీ సమస్య చెప్పి ఫిర్యాదు రాయమని చెప్పాము. ఆమె తన సమస్యను వివరించింది.

మేడమ్! మాది భీమవరం మా పుట్టినిల్లు నరసాపురం. నా భర్త పేరు ఆర్యన్. నా పేరు వహీదా. మా అమ్మ నాన్నలకు నేను, తమ్ముడు సంతానం. తమ్ముడు గల్ఫ్‌లో ఉంటాడు. నాన్న మమ్మల్ని పెద్దగా పట్టించుకోలేదు. అమ్మ మమ్మల్ని పెంచి పెద్ద చేసింది. మేము క్రైస్తవులం. నేను డిగ్రీ వరకు చదివాను. ఆరోజులలోనే నా భర్త నన్ను చూసి పరిచయం పెంచుకున్నాడు. ఇద్దరం పరస్పరం ప్రేమించుకున్నాము. వాళ్ళు ముస్లింలు. నువ్వు మా మతంలోకి మారాలని చెప్పి నా మతం మార్చి వివాహం చేసుకున్నాడు. అతను పెద్దగా చదువుకోలేదు. కానీ బంగారం షాపు నడుపుతాడు. పని బాగానే తెలుసు. సంపాదన బావుండేది. నాకు ఒక బాబు, పాప. పిల్లలిద్దరూ చాలా బాగా చదువుకుంటున్నారు. 4 సంవత్సరాల క్రితం వరకు మాకు ఏలోటు లేకుండానే చూసుకున్నాడు. ఆస్థి కూడా బాగానే సంపాదించాడు. వాళ్ళు ముగ్గురు అబ్బాయిలు. ఇద్దరు అమ్మాయిలు పెద్ద సంసారం. తండ్రి చనిపోయాడు. విజయవాడలోనే అందరూ ఉంటారు. ఇక్కడికి మేము తరచుగా వచ్చేవారం. తరువాత తనొక్కడే వెళ్ళేవాడు. నేను కూడా వాళ్ళ ముస్లిం మతాచారాలనే పాటించాను. పిల్లలకు కూడా అలాగే నేర్పించాను. ఇంటి బాధ్యత అంతా నేనే చూసుకుంటాను. ఈ మధ్యనే అతను ఆడవాళ్ళతో అక్రమ సంబంధాలు నడుపుతున్నాడని తెలిసింది. బాగా తాగుతాడు. చాలా రోజులు బాధపడ్డాగానీ ఆయన్ని అడగలేదు. ఒకరోజు షాపుకి వెళ్ళినప్పుడు అతని దగ్గర చాలామంది ఆడవాళ్ళ ఫోటోలు ఉన్నాయి. 'ఎవరు? వీళ్ళంతా' అని అడిగితే బంగారం ఆర్డరు ఇచ్చినవాళ్ళని చెప్పాడు. కానీ కాదని తెలిసింది.

ఒకసారి నన్ను పిల్లల్ని ఏలూరు తీసుకొని వెళ్ళి మమ్మల్ని వదిలేసి తను ఎక్కడికో వెళ్ళిపోయాడు. నేను ఎదురుచూసి విసిగిపోయి పిల్లల్ని తీసుకుని తిరిగి ఇంటికి వచ్చేశాను. నాలుగు రోజుల తర్వాత వచ్చాడు. అలా చేశావేంటని అడిగితే కొంచెం పనుండి అవసరమై వెళ్ళానన్నాడు. అయినాగాని పుట్టింట్లో సరైన ఆదరణ లేక ఆర్యన్‌తో గొడవపడ్డా ఎటు వెళ్ళాలో తెలియక సర్దుకుపోవడం, అతని చేష్టలన్నీ నాకళ్ళ పడ్డా ఏమీ చూడనట్లుండటం అలవాటుచేసుకున్నాను. ఇలా కొన్నాళ్ళుగా జరుగుతుంది. 15 రోజుల క్రిందట ఒకరోజు రాత్రి భోజనం చేసి పడుకున్నాడు. మర్నాడు చూస్తే కనబడలేదు. షాపులో పనివాళ్ళకు చెప్పలేదు. అందిన చోటల్లా అప్పులు చేసి ఆడవాళ్ళకు పెట్టాడని తెలిసింది, ఫోన్ చేసినా స్విచ్ ఆఫ్ చేశాడు. 4రోజుల తరువాత మా తోడికోడలు ఫోన్ చేసి ఆర్యన్ మా దగ్గర ఉన్నాడని చెప్పింది, నేను ఆర్యన్‌తో మాట్లాడాను. అర్ధరాత్రి భార్యా పిల్లల్ని వదిలి వెళ్ళిపోవడం ఎంతవరకు న్యాయం? నన్నేం చెయ్యదలుచుకున్నావని అడిగాను. దానికి ఆర్యన్ సమాధాన మేమంటే నాకు చాలా అప్పులైనాయి. నా పరిస్థితి ఏమీ బాగా లేదు. ఆడబ్బు నేను తీర్చలేను నువ్వు పిల్లలు ఇక్కడకి వచ్చేయండి. నేను ఏదో ఒక పని చేసి పోషిస్తాను అన్నాడు. అది నాకిష్టం లేక మా పుట్టింటికి వెళ్ళాను. తిరిగి ఒక వారం తరువాత భీమవరం వచ్చాను. పిల్లలు 6,8 క్లాసులు చదువుతున్నారు. వాళ్ళ పరీక్షలు అయ్యేదాకా వుండాలని నిర్ణయించుకుని ఆర్యన్‌కి ఫోన్ చేశాను. 'నేను అక్కడకు రాను. నాకు నువ్వు వద్దు, నీ బ్రతుకు నీవు బ్రతకమన్నాడు. పిల్లల్ని తనికిచ్చేస్తే తను పెంచుకుంటానన్నాడు. ఇపుడు నేనేం చెయ్యను?' అమ్మా అని అడిగింది వహీదా.

ఐద్వా లీగల్ సెల్ నుంచి ఆమె భర్తకు లెటర్ పంపించాము. దానికి అతను బాధ్యులకు ఫోన్ చేశాడు. 'నేనెక్కడకు రాను. నాకు అవసరం లేదు. నా పరిస్థితి బాగుండలేనందున నేనెవ్వరినీ పోషించలేను' అన్నాడు. 'ఒకసారి ఇక్కడకు వచ్చి మాట్లాడు' అంటే వీలైతే పైవారం వస్తానన్నాడు. మా అన్నయ్య దగ్గరే వుండి పనిచేసుకుంటానన్నాడు.

ఈ లోపు ఫోన్ చేసి వహీదాని కూడా విజయవాడ వచ్చి ఉండడానికి ఒప్పించాము. ఆమె పిల్లల పరీక్షలైనాక వచ్చేస్తానని చెప్పింది. ఆర్యన్ వచ్చి ఐద్వా బాద్యులతో ఈ విధంగా మాట్లాడాడు.

'నాభార్య అనుమాన పిశాచి. నేను తాగుతాను, కొన్ని తప్పులు కూడా చేశాను. ఆస్థి అంతమయింది. నా సంపాదన నా ఇష్టం. నేను మా అన్నయ్య దగ్గర ఉంటాను. నాకు వహీదా

వద్దు. పిల్లల్ని ఇప్పించండి అన్నాడు. 'మరి నువ్వు పెళ్ళి చేసుకొని పిల్లల్ని చూడకపోతే ఎలాగ' అని అడిగితే అతను నా పిల్లలు నా ఇష్టం. నేనెలాగో ఒక లాగ పెంచుతానని చాలా పొగరుగా మాట్లాడి వెళ్ళాడు. నా భార్య నాకు 4 సంవత్సరాలుగా నరకం చూపిస్తోంది. నన్ను లారీ క్రింద పడి చావమంది. ఆమె నాకొద్దు అన్నాడు. 'మరి ఆమె ఎలా బ్రతకాలి' అని అడిగితే ఇంట్లో ఒక లక్ష రూపాయల ఫర్నీచరు వుంది. ఆమె పేర 7లక్షల ఖరీదు చేసే స్థలం వుంది. అది తీసుకుని బతకమన్నాడు.

కానీ ఆ ఏడు లక్షల స్థలంపైన 70 వేల అప్పు, 3 కాసుల బంగారం ఇవ్వవలసి ఉందని తెలిపింది.

ఆమెను మేము భీమవరం పోలీస్ స్టేషన్‌లో కేసు పెట్టమని అక్కడి ఐద్వా సభ్యుల నెంబరు ఇచ్చి పంపాము. అక్కడ కేసు నడిచింది. ఆర్యన్‌కి పోలీసులు బాగా బుద్ధి చెప్పారు. 6 నెలలు భరణం ఇచ్చి ఆ తరువాత విడాకులు ఇవ్వమని చెప్పారు.

15 రోజుల తరువాత ఒకరోజు వహీద ఫోన్ చేసింది. 'అమ్మా బావున్నారా?' అని అడిగింది. "అమ్మా నాకు అభిమానం ఎక్కువ. నేనెంతో ప్రేమించి, నమ్మిన నా భర్త నిజ స్వరూపం తెలిశాక అతని డబ్బు అక్కరలేదనిపించింది. మీరంతా కలిసి అతనికి బుద్ధిచెప్పారు. నాకది చాలు. అన్నిసార్లు వద్దు వద్దు అనే మొగుడు నాకూ వద్దమ్మా. అందుకే ఇక్కడ చుట్టూ ఉన్న షాపుల వాళ్ళను పెట్టుకుని పనిచేసుకుంటాను. నాకు ధైర్యం ఇచ్చి అండగా ఉండమని అడిగాను. అందరూ కలిసి షాపు తిరిగి నాచేత ఓపెన్ చేయించారు. మా తమ్ముడు కొంత ఆర్థిక సాయం చేశాడు. స్థలం కాగితాలు విడిపించుకున్నాను. తనకి సంబంధించిన వస్తువులన్నీ తీసుకుని కనీసం పిల్లలనన్నా పలకరించకుండా వెళ్ళాడు.

6 నెలల తరువాత కోర్టులో విడాకులకు కేసు పెడతానని, ఇప్పుడు ధైర్యంగా ఉంది. ఎంతకష్టమైనా పిల్లల్ని పెంచి మంచి పౌరులుగా తీర్చిదిద్దుతానని" చెప్పింది వహీదా.



# మనం

కారం పట్టుకున్న వేలిని..
కంట్లో పెట్టుకున్నట్లు...
కొన్నిసార్లు మన కన్నీటికి,
మనమే కారణం అవుతాం...
అసంకల్పితంగా కొన్ని...
ఇష్టం లేకపోయినా కొన్ని...
అసహాయంగా కొన్ని!!
అనుబంధాల్ని...
బంధాలుగా చేసుకొని...
మనసు ఎదురు తిరుగుతున్నా,
చిరునవ్వుల దుప్పటి కప్పేసి...
ఆలోచనలు రేగకుండా...
భాద్యతల బరువు పెట్టేస్తాం.
మన జీవితానికి మనమే
చిక్కుముడి వేసుకుంటాం
ఏ ముడి పడడానికయినా
రెండు కొసలూ కావాలి,
ఏ బంధం నిలవాలన్నా
రెండు మనసులూ కలవాలి.
ఎప్పటికైనా "మనం" అంటే...
కేవలం మంచిగా మిగలడం కాదు!!
మనం అంటే మనసు చెప్పినట్లు వినడం...
మనం అంటే మనంగా మిగలడం...

– నూతక్కి ఉమ

మొదటి ప్రయత్నంలోనే సివిల్స్‌లో ప్రథమ స్థానాన్ని కైవసం చేసుకున్న దళిత యువతి టీనా



# సంక్షేమ కార్యకలాపాల ద్వారా ఐద్వా విస్తరణ - ఒక అనుభవం

- పి. విజయ

విజయవాడ నగరంలో పటమటలంక పుట్టరోడ్ ప్రాంతం ఇది. బందరు కాలువ మార్జిన్‌లో భవన నిర్మాణం, మున్సిపల్, రజకవృత్తి, ఇంటిపని, ఆటో, చిన్న పరిశ్రమలు, చేపల మార్కెట్, పండ్లు, కూరగాయల అమ్మకాలు మొదలైన అసంఘటిత రంగాలలో పనిచేసే కార్మికులు నివాసం ఉంటున్నారు. ఇటీవల కాలంలో మహిళా ఉద్యమాలు గాని, సంఘాలు గాని ఇక్కడ కదలికల్లో లేవు. గత 6,7 మాసాలలో ఇక్కడ చేపట్టిన సామాజిక సంక్షేమ కార్యక్రమాలు మహిళలను కదిలించడానికి, ఐద్వా స్థాపనకు తోడ్పడ్డాయి. అనేక అనుభవాలు వచ్చాయి.

సరళీకరణ విధానాల నేపథ్యంలో కుటుంబంలో ఖర్చులు పెరిగిపోయాయి. కుటుంబ ఆదాయం పెంచుకోవాలని, స్వశక్తితో బ్రతకాలనే తృష్ణ మహిళల్లో పెరిగింది. జనశిక్షణా సంస్థాన్ సహకారంతో 2 కుట్టుమిషన్లు, ఒక టీచరుతో కుట్టు శిక్షణ కేంద్రాన్ని ప్రారంభించాము. 3నెలల్లోనే 25మంది పట్టుదలతో కుట్టడం నేర్చుకున్నారు. మధ్యలో రెండుసార్లు ఐద్వా తరపున మహిళల ఆత్మవిశ్వాసం పెంచటానికి, శక్తి సామర్థ్యాలు వెలికి తీయడానికి వ్యక్తిత్వ వికాసంపై ఉపన్యాసాలు ఇప్పించాము. శిక్షణాకేంద్రం ఆటంకాలు లేకుండా కొనసాగటానికి సమన్వయం చేశాము. సాధారణంగా శిక్షణ పూర్తికాగానే అంతటితో ఆ కార్యక్రమం నిలిచిపోతుంది. దీన్ని కొనసాగించటానికి సప్తగిరి గ్రామీణ బ్యాంకు వారితో పలుసార్లు రాయబారం నడిపాము. 16కుట్టు మిషన్లు రుణంపై ఇవ్వటానికి వారు అంగీకరించారు. మార్చి 18న కుట్టు మిషన్ల పంపిణీకి సభ నిర్వహించాము. అనూహ్యంగా 120మంది మహిళలు పాల్గొన్నారు. గతంలో కుట్టుశిక్షణా కేంద్రం సరిగా పనిచేయక నేర్చుకోలేకపోయానని, తన భర్త నీకు కుట్టు రాదని అన్నాడని నేడు ఐద్వా నడిపిన కేంద్రంలో నేర్చుకొని జాకెట్లు, లంగాలు కుట్టుకొంటుంటే తన భర్త అభినందించాడని ఒక మహిళ ఆనందంతో చెప్పింది.

బ్యాంకు రుణాలు అందించే క్రమంలో ఐద్వా శాఖను ఏర్పరచి కమిటీని ఎన్నుకోవడం జరిగింది. ఈ కమిటీ ఆధ్వర్యంలో భవిష్యత్ కార్యక్రమాలు నిర్వహించాలని నిర్ణయించాము. దీనికి కొనసాగింపుగా మాకినేని బసవపున్నయ్య విజ్ఞానకేంద్రం, లైన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ జూబ్లీతో కలసి ఏప్రిల్ 24న "ఉచిత నేత్ర శిబిరం" ఏర్పాటు చేశాం. ఈ శిబిరానికి ప్రజలు రావాలని కమిటీ ఆధ్వర్యంలో 25మంది మహిళలు ఎన్నికల ప్రచారం వలె ఇంటింటికీ తిరిగి కరపత్రాలు పంచారు. శిబిరానికి 163 మంది రాగా 130మందికి కళ్ళ జోళ్ళు, 20మందికి ఆపరేషన్లు అవసరమయ్యాయి. మే 5వ తేదీన 3సంస్థలూ కలసి 130మందికి ఉచితంగా కళ్ళజోళ్ళు అందజేయటం జరిగింది.



ఒక మహిళ కళ్ళకు మసక వచ్చి చూపు తగ్గిందని, కళ్ళజోడు వేసికొన్న తరువాత కొత్తగా చూపు వచ్చినట్లయిందని ఆనందాన్ని వ్యక్తం చేసింది. కళ్ళజోళ్ళ పంపిణీ తరువాత చిన్న పిల్లల నుండి 70సం॥ ముసలివారి వరకు సంతోషంతో సంఘం పట్ల ఆప్యాయత వ్యక్తం చేస్తున్నారు.

వేసవి సెలవుల్లో విద్యార్థులకు శిక్షణ ఇప్పించాలని నిర్ణయించాము. ఇంటింటికీ సర్వే చేయగా 5నుండి 10 తరగతుల మధ్య విద్యార్థులు 50మంది లెక్క తేలారు. యుటిఎఫ్, ఇతర ఉపాధ్యాయులు బోధించటానికి ముందుకొచ్చారు. మే 10నుండి జూన్ 10 వరకు (నెలరోజులు) యుటిఎఫ్, ఐద్వా కలసి **"వేసవి విద్యా వికాసకేంద్రం"** ప్రారంభించాము. ప్రారంభసభకు 40మంది మహిళలు, 50మంది విద్యార్థులతో విజయవంతంగా జరిగింది. ఒక చదువే కాక పిల్లల మానసిక వికాసానికి, ఆరోగ్యానికి డ్యాన్సు, వివిధ రకాల ఆటలు ఒక గంటపాటు ఆడించాలని, మిగతా రెండు గంటలలో ఇంగ్లీషు, లెక్కలు, తెలుగు, సైన్సు బోధించాలని కార్యక్రమం రూపొందించాము. డ్యాన్సు నేర్పించటం వలన వేసవి సెలవుల్లో బంధువుల ఇళ్ళకు వెళ్ళాలన్న ప్రణాళికను పిల్లలు మార్చుకున్నట్లు కమిటీసభ్యులు తెలిపారు.

పిల్లల ఆరోగ్య సమస్యలపై డాక్టర్లతో అవగాహన సదస్సులు జరపాలని, పాఠశాలలు తెరిచిన తరువాత ఆదివారాలు, సెలవు దినాలలో ఆటలు, పాటలు, బోధన ద్వారా విద్యార్థుల సృజనాత్మక శక్తి పెంచాలనే ప్రణాళికలు ఉన్నాయి.

భావ సారుప్యత గల సంఘాలు, సంస్థలతో ఐక్యకార్యా చరణ ద్వారా సంఘాన్ని అభివృద్ధి పరచటానికి అనేక అవకాశాలు వున్నాయి. సామాజిక, సంక్షేమ కార్యక్రమాలు పలు రూపాలలో చేపట్టటం ద్వారా మహిళలను కదిలించటానికి, ఐద్వా విస్తరణకు దోహదపడుతుందని అనుభవంలో వెల్లడయ్యింది.

ఆరోగ్యం

# పీరియడ్స్‌లో అధికరక్తస్రావం (మోనరేజియా)

- డాక్టర్ యం. రమాదేవి, జనవిజ్ఞాన వేదిక

పీరియడ్స్‌లో రక్తం అధికంగా పోవడాన్ని వైద్య పరిభాషలో మోనరేజియా (menorrhagia) అంటారు.

ఎక్కువపోవడం అంటే ఎంత?

ఒక పీరియడ్‌లో మామూలుగా పోయే రక్తం సుమారుగా 50 ml దాకా వుంటుంది. అంతకంటే ఎక్కువ రక్తం పోవడాన్ని బహిష్టుస్రావం అతిగా కావటం క్రింద జమకట్టవచ్చు. ఒక బండగుర్తు ఏమిటంటే మామూలుగా వాడే శానిటరీ నాప్‌కిన్స్‌కంటే ఎక్కువ నాప్‌కిన్స్‌ని వాడాల్సిరావడం. పీరియడ్స్‌లో రక్తం అధికంగా పోవడానికి కారణాలు రకరకాలుంటాయి.

**1. పొరమందం వల్ల :-** కొందరు స్త్రీలలో ప్రత్యేకకారణ మంటూ ఏమీ లేకుండానే పీరియడ్స్‌లో రక్తం అధికంగా పోతుంది. గర్భసంచి లోపలవుండే పొరను ఎండోమెట్రియం అంటాము. ఆ పొర వుండాల్సినమందం కంటే ఎక్కువ మందం వుండటం ఒక కారణం ఇలా పొర మందంగా వుండటం వల్ల అవి ఉబ్బి తునకలు, తునకలుగా కిందికి జారినపుడు రక్తం ఎక్కువపోతుంది.

**2. హార్మోన్లలోపం వల్ల :-** శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోనులలో సమతూకం లోపిస్తే కూడా అధికస్రావం అవుతుంది. హార్మోన్ల లోపం మూలంగా అన్నది తెలిస్తే తగు హార్మోన్ల చికిత్స చేయించుకోవాలి. కొన్ని నెలలపాటు మందులు వాడితే ఇది సరిచేయబడుతుంది.

**3. గర్భస్రావం వల్ల :-** ఎప్పుడైనా ఒక పీరియడ్ ఆలశ్యమయి ఆ తర్వాత అతిగా రక్తస్రావం అవుతుంటే ప్రారంభంలో గర్భస్రావమయిందేమో నిర్ధారించుకోవాలి. డాక్టరును కలిస్తే అవునో, కాదో తేల్చిచెపుతారు.

**4. లూప్ మూలంగా :-** ఫ్యామిలీ ప్లానింగ్ కోసం గర్భాశయంలో ప్రవేశపెట్టే లూప్ లేక కాపర్ టి లాంటి సాధనాల మూలంగా కూడా పీరియడ్ సమయంలో రక్తం ఎక్కువగా పోయే అవకాశం వుంది. గర్భాశయంలో లూప్‌ని ప్రవేశపెట్టిన తర్వాత రోజుల్లో రక్తస్రావం అవుతుంటే గాబరా పడాల్సిన అవసరం లేదు. రెండు, మూడు నెలల తర్వాత దానికదే సర్దుకుంటుంది. అయితే బహిష్టు స్రావం మామూలు కంటే అసాధారణంగా ఎక్కువ అవుతున్నప్పుడు దినవారి కార్యక్రమాలకు అది ఆటంకంగా పరిణమిస్తున్నప్పుడు లూప్‌ను తీయించుకుని గర్భనిరోధం కోసం మరొకరకమైన పద్ధతిని అనుసరించాల్సి వుంటుంది.

**5. గర్భాశయంలో గడ్డలు :-** వీటినే ఫైబ్రాయిడ్స్ అంటాము. ఇవి కాన్సర్ సంబంధం కానీ గడ్డలు. పీరియడ్స్ ద్వారా పోయే రక్తం మరీ అధికంగా వుంటే ఇవి వున్నాయేమో స్కానింగ్ ద్వారా నిర్ధారించుకోవాలి. ఒకవేళ సమస్య ఎక్కువగా వుంటే డాక్టర్లు వీటిని ఆపరేషన్ ద్వారా తొలగిస్తారు. గర్భాశయంలో ఈ గడ్డలు ఏర్పడటం ఎక్కువగా 35సంవత్స రాలు దాటిన స్త్రీల విషయంలో జరుగుతుంది. ఈ గడ్డలు మరీ పెద్దగా వుండి, ఆమె పిల్లల్ని కనే వయస్సును దాటివుంటే గడ్డలతో పాటు గర్భ సంచిని కూడా తొలగిస్తారు. కానీ ముట్లుడిగిన తర్వాత స్త్రీ శరీరంలో జరిగే హార్మోన్ల మార్పుల వల్ల సామాన్యంగా ఈ గడ్డలు వాటికవే తొలగిపోతాయి. అందుకని ముట్లుడిగే దశకు దగ్గరలో వుంటే గడ్డలు పెద్దగా ఇబ్బంది పెట్టకుండా వుంటే, ఆమె ఆపరేషన్ కోసం తొందరపడకుండా కొన్నాళ్ళపాటు వేచి చూడటం మంచిది. స్వత:సిద్ధంగానే అవి వాటికవి మాయమైపోతాయి.

**6. మానసిక కారణాలు :-** పీరియడ్స్‌లో రక్తం అధికంగా పోవడానికి రకరకాల ఒత్తిడులు, ఎగుడుదిగుడులు, శారీరక శ్రమ లాంటివి కూడా కారణాలుగా వుంటాయి. ముఖ్యంగా కుటుంబ కలహాలు, వివాహంలో ఒడిదుడుకులు, భరించరాని ఆందోళన మొదలైనవి.

**7. ఎండోమెట్రియోసిస్ :-** గర్భాశయం లోపల ఏర్పడే పొరలాంటిది గర్భాశయం బయట, అండాశయం పైభాగాన, పొత్తికడుపు లోపలి వైపున ఏర్పడుతుంది. దీనినే ఎండోమెట్రియే సిస్ అంటాము. ఈ పరిస్థితి కూడ పీరియడ్స్‌లో అధిక స్రావం కావడానికి కారణం కావచ్చు. పీరియడ్స్ సమయంలో ఈ పొర తాలూకు తునకలు కూడా "ఉబ్బివస్తూ" అధికరక్తం పోవడం, పొత్తికడుపులో విపరీతమైన నొప్పిరావటం వుంటుంది. సామాన్యంగా ఈ పరిస్థితిని హార్మోన్ల చికిత్స ద్వారా తగ్గించవచ్చు. లేకపోతే గర్భాశయ పొరను సర్జరీ ద్వారా తొలగించడం చేస్తారు.

**జాగ్రత్తలు - చికిత్స :-** పీరియడ్ సమయంలో అధిక రక్తస్రావం అవుతుంటే అజాగ్రత్తగా వుండకూడదు. ఎందుకంటే దీనివల్ల రక్తహీనత లేదా అనీమియా వస్తుంది. రక్తంలో హిమోగ్లోబిన్‌శాతం తగ్గిపోతుంది. దీనితో విపరీతమైన అలసట, పనిపట్ల శ్రద్ధలేకపోవడం, ఒళ్ళు నొప్పులు లాంటి అనేక సమస్యలు వస్తాయి. శరీరంలో రోగనిరోధక శక్తి తగ్గిపోతుంది. శరీరంలో ఐరన్‌లోపం వల్ల కూడా అధిక స్రావం జరిగే అవకాశముంది. కాబట్టి తీసుకునే ఆహారంలో ఐరన్ వుండేటట్లు చూసుకోవాలి. ఐరన్ వుండే ఆహారాలు లివర్, మాంసం, కోడిగ్రుడ్లు, తాజా కూరగాయాలు, ఆకుకూరలు, బెల్లం, ఖర్జూరాలు లాంటివి ఎక్కువగా తీసుకోవాలి. అలాగే హీమోగ్లోబిన్ పెరగడానికి ఐరన్ టాబ్లెట్లు వేసుకోవాలి. డాక్టరుతో చూపించుకుని అధిక స్రావానికి కారణం తెలుసుకుని, చికిత్స చేయించుకోవాలి. అదే విధంగా విటమిన్ ఎ, కాల్షియం, ఆయోడిన్ లోపాలు కూడా హెవీ పిరియడ్స్‌కు మూలమని భావించబడుతోంది. సరిపడా విశ్రాంతి తీసుకుంటూ, అలసట కలిగించే శారీరక శ్రమ జోలికి వెళ్ళకుండా వుండాలి. వీలైనంత వరకు దిగులు, టెన్షన్, ఆవేశాలకు లోను కాకుండా తగిన శారీరక వ్యాయామం చేయాలి.

# ఆచార్య కొలకలూరి ఇనాక్ స్త్రీ పాత్రలు - వ్యక్తిత్వం

- ఆచార్య కొలకలూరి మధుజ్యోతి, పద్మావతి

జ్ఞానపీఠ్ కమిటి వారిచే మూర్తిదేవి పురస్కారానికి అర్హులుగా గుర్తింపబడి ఎంపిక అయిన తొలి తెలుగు రచయిత ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు. తెలుగు సాహిత్య కళామతల్లికి విశేష అద్వితీయ కిరీటాన్ని అలంకరించిన పద్మశ్రీ ఆచార్య ఇనాక్ గారు తెలుగు సాహిత్య సృజనలో అన్ని ప్రక్రియలలో అనితర సాధ్యమైన కృషిని సల్పారు. దానికి నిదర్శనం వారి ఎనభై నాలుగు గ్రంథాలు.

వారి కథానికా సాహిత్యం అందులో ఒక భాగం. అదో పెద్ద ప్రపంచం. స్త్రీల, దళితుల, గిరిజనుల, బహుజనుల పక్షపాతిగా నిల్చిన ఆచార్య ఇనాక్, స్త్రీలను గురించి వారి సమస్యల గురించి అనేక కోణాలలో చిత్రించారు. తల్లిని అమితంగా గౌరవించే, భార్యను అన్యోన్యంగా ప్రేమించి గౌరవించే ఆచార్య ఇనాక్ తను చిత్రించిన స్త్రీల పట్ల పక్షపాత వైఖరి చూపటంలో ఆశ్చర్యం లేదు.



స్త్రీ పురుషుల ప్రేమ ఆకర్షణ విఫల ప్రేమలు కలిసిన జంటలు (మల్లెమొగ్గ జాగ్రత్త, తప్పు జరిగింది, మచ్చ తొలగింది, నిశీధి నీ శంఖారావం వంటి కథలు) అపోహలు అపార్థాలు ఆ వయస్సు ధర్మాలుగా (అగరొత్తి కాలింది, రాగరేఖలు, సమాగమం, ఉద్యోగం, పందిరి లేని తీగ) ఉన్న కథలనూ రాశారు. స్వచ్ఛమైన ప్రేమ యువతను ఎలా ఉత్థాన పతనాలకు నడుపుతుందో చెప్పారు. కులం, ధనం పరిమితులను దాటి ఆదర్శవంతమైన ఆలోచన యువతను నడపాలనే దృష్టితో (చాలీచాలని చేం తాళ్ళు, సౌశీలం, ఇదేం న్యాయం, బొట్టు) రాశారు. పురుషాధిపత్యం స్త్రీని కుంగదీయటాన్ని (సాలెగూడులో ప్రమీల, విముక్తి) చిత్రించారు. విప్లవాత్మక స్త్రీ స్వభావాలను సంఘ వ్యతిరేకం కాని సంఘం అర్థం చేసుకోవలసిన తీరును (కుమారి ఝాన్సీ వసంత, డౌరీడెత్, గమ్యం, విపర్యయం ట్రోఫీ, పిల్లను కంటాను, రమ నా కూతురు, బర్త్ సర్టిఫికేట్) చూపారు. దాంపత్య సౌందర్యం మార్దవం అవగాహన (కుంకుమ, జీవనం ఇదా జీవితం, కొత్త యిల్లు, రుచి, గుండె మార్పిడి, నాకీ అదృష్టం చాలు, దైన్యం లేని జీవితం) ఆవశ్యకత చిత్రించారు. స్త్రీ పురుషుడి చేతిలో దోపిడికి గురి కావటం (అవాంఛితం, మంచు శిఖరం, తేలుకుట్టిన పాము, ఏడీ సూర్యుడు) నిరసించారు. స్త్రీలకు పిల్లల పట్ల ఉన్న ఇష్టం అనుబంధాలను (ఇంకేం కావాలి, స్నేహామృతం) కథలలో చూపారు. ఇలా స్త్రీ సంబంధమైన బహుపార్శ్వాలను ఆచార్య ఇనాక్ గారి కథా సాహిత్యం ప్రదర్శించింది. అందులో మూడింటిని భిన్న కాలాలకు చెందిన కథలు ఈ వ్యాస పరిధిగా గ్రహించాను. ఈ కథలు మారని ఆలోచన సరళికి, రచయిత దృఢంగా భావించిన అంటిపెట్టుకొన్న ఆలోచనకి నిదర్శనం. అది స్త్రీ ఔన్నత్యం. స్త్రీని కించపరచటం న్యూనంగా చూడటం వీరి రచనల్లో ఎక్కడా కనిపించదు.

**1. 'సౌశీల్యం'**-1962 (భవాని1967) భిన్న ఆదర్శాన్ని ప్రతిపాదించిన కథ. సుశీల తండ్రి లేని పిల్ల. నవనీతం అనే టీచరు ప్రభావంతో చదువుకొన్న హరిజన స్త్రీ. చిన్నప్పటి నుంచి ప్రభుత్వం నడిపే హాస్టల్లో ఉంటూ స్కాలర్ షిప్పులతో చదువుకొన్న

కుల సమస్య, వరకట్న సమస్య. హరిజన క్రైస్తవులు, క్రైస్తవాన్ని స్వీకరించని దళితులు రెండు రకాలు. ఎదిగిన హరిజనక్రైస్తవులు, ఎదగని దళితుల పట్ల చిన్న చూపు కలిగి ఉండటం వలన సంబంధాలు కలుపుకొనే పరిస్థితి లేదు. ఈ కారణాన చదువుకొన్నా, క్రైస్తవం స్వీకరించని ఈ దళితురాలికి వివాహం ఒక సమస్య అయ్యింది. పేదరికంలో నుంచి వచ్చిన సుశీల స్కాలర్‌షిప్పులతో చదువుకొంది. ఉద్యోగంలో చేరింది. ఇంత ఉన్నతోద్యోగంలో ఉన్న సుశీలకు వివాహం కష్టం అయ్యింది కారణం వరకట్నం. వరకట్న రుగ్మత. బాగా చదువుకొన్నవారు కట్నం లేనిదే చేసుకోరు. వరకట్నం ఇచ్చుకోలేని స్థితి సుశీలది.

స్త్రీ. మధ్యలో వచ్చిన సంబంధాలని కాదనుకొని లెక్చరరు ఉద్యోగం వచ్చిన దాకా ఆగింది. ఇప్పుడు ఉద్యోగస్థురాలైన ఆమెకు తగిన వరుడు దొరకటం లేదు. హరిజన స్త్రీ అయిన సుశీల తగిన వరుడికి కట్నం ఇచ్చు కోలేని స్థితి. హరిజనుల కంటే బాగా చదువుకొన్న క్రైస్తవులు దళితులే అయినా వీరిని చేసుకోరు. ఇలా ఆమె అవివాహిత యువతిగా ఉంది. ఈ విషయా న్నంతా ఓ రాత్రి రైలు ప్రయా ణంలో ఓ ముసలవ్వ అడిగితే చెప్పింది. పక్క బెర్తు మీదే నిద్ర పోతున్నట్టు నటిస్తున్న ఎం.ఏ చదివిన రాంబాబు, నిజానికి పెళ్ళి చూపులకు విశాఖ వెళ్తున్న అందమైన రాంబాబు, తెల్లవారగానే, సుశీలతో తానంతా విన్నానని తన వివరాలు చెప్పాడు. తల్లితో సుశీల సామర్లకోటలో దిగిపోయింది. తన తండ్రి తన కోసం వాల్తేరులో వస్తాడు, సంబంధాలు ఇక ఏమీ చూడవద్దని చెప్పమనే బాధ్యత ముసలవ్వకు అప్పగించి తానూ అక్కడే దిగిపోయాడు.

అప్పటికి రాంబాబు ఎం.ఏ చదికిన వ్యక్తి. సుశీల విషయం అంతా విన్నాక ఆమె కంటె అధికంగా చదువుకొన్న రాంబాబు వివాహానికి సిద్ధపడ్డాడు. హరిజనులు క్రైస్తవులుగా అంటూ కనిపించే ఈ విభజన క్రైస్తవాన్ని స్వీకరించిన, స్వీకరించని దళితులను గూర్చితెల్పేదే. తొలి కాలాలలో దళితులలో చదువుకొని బాగా వృద్ధిలోకి మాలకులస్తులు రాగా, మాదిగలు వెనుక బడ్డారు. ఈ కథలో సుశీల మాదిగ స్త్రీ అయి ఉండాలి. ఓ దళిత స్త్రీని దళితుడే చేసుకొన్నాడు అంటే, కథలో ఇచ్చిన సూక్ష్మాల ప్రకారం అతడు మాల కులస్తుడయినా కావాలి లేదా ఈ కుల వికారం అంటని ఒకానొక ఆదర్శ పురుషుడైనా కావాలి. ఈ రకంగా వరకట్న దురాచారానికి యువతి జీవితాన్ని బలి కానివ్వలేదు. మరో విధంగా ఇది కులాంతర వివాహం.

ఈ కథలో రెండు సమస్యలను రచయిత చర్చించారు. కుల సమస్య, వరకట్న సమస్య. హరిజన క్రైస్తవులు, క్రైస్తవాన్ని స్వీకరించని దళితులు రెండు రకాలు. ఎదిగిన హరిజనక్రైస్తవులు, ఎదగని దళితుల పట్ల చిన్న చూపు కలిగి ఉండటం వలన సంబంధాలు కలుపుకొనే పరిస్థితి లేదు. ఈ కారణాన చదువుకొన్నా, క్రైస్తవం స్వీకరించని ఈ దళితురాలికి వివాహం ఒక సమస్య అయ్యింది.

పేదరికంలో నుంచి వచ్చిన సుశీల స్కాలర్‌షిప్పులతో చదువుకొంది. ఉద్యోగంలో చేరింది. ఇంత ఉన్నతోద్యోగంలో ఉన్న సుశీలకు వివాహం కష్టం అయ్యింది కారణం వరకట్నం. వరకట్న రుగ్మత. బాగా చదువుకొన్నవారు కట్నం లేనిదే చేసుకోరు. వరకట్నం ఇచ్చుకోలేని స్థితి సుశీలది. ఒక అంతర్గత సమస్య ఒక సామాజిక రుగ్మతల కారణంగా అవివాహితగా ఉంది సుశీల.

ఈ కథలో రెండు సమస్యల కంటే ప్రధానంగా నిలిచింది దృఢమైన సుశీల వ్యక్తిత్వం. ఆమె దృష్టి వివాహంపై కాదు కనుకే మొదటిలో వచ్చిన సంబంధాలను కాదనుకొంది. చిన్నా చితకా ఉద్యోగాలనూ కాదనుకొంది. కోరిన లెక్చరరు ఉద్యోగం వచ్చాక అందులో చేరింది. జీవితంలో దొరికిన వాటితో కాక జీవితాన్ని తాను కోరుకొన్నట్టు పొందాలనుకొనే పట్టుదల సంబంధాలను వద్దనుకోవటంలో ఉంటే, జీవితాన్ని గుణాత్మకంగా గడపాలనే పట్టుదలకు ఆమె ఉద్యోగం నిదర్శనం. ఈ రెండూ ఆమెకు వివాహాన్ని కొంత ఆలస్యం చేసినా, రాంబాబులాంటి ఆదర్శవ్యక్తి లభించటానికి కారణం అయ్యాయి.

'స్త్రీ వాద సాహిత్యావిర్భావానికి పరిస్థితులు పరిపక్వమైంది పంతొమ్మిది వందల డెబ్బై తరువాతే' (ఆధునిక తెలుగు సాహిత్యం-స్త్రీవాద భూమిక, కాత్యాయనీ విద్మహే,పు. 2).

ప్రపంచ వ్యాప్తంగా 1975ను అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా, 1975-85 దశాబ్దిని అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా యునెస్కో ప్రకటించింది. ఏ పూనికా లేని, అటువంటి చైతన్యమే లేని కాలంలో రచితం ఈ కథ. 1962లో రాసిన ఈ కథలో వరకట్న, కుల రుగ్మతలు దాటి జీవితం ఉండాలని చాటింది. సుశీల దృఢమైన వ్యక్తిత్వం ఈ కథలో ఉంది.

**2. 'గమ్యం'** (అస్పృశ్య గంగ,1999) కథ మరో సాహసవంతురాలిని చూపుతుంది. పన్నెండేళ్ళకే ఈడేరిన నాగమ్మను మేనమామ పాతికేళ్ళ నాగిరెడ్డికిచ్చి పెళ్ళి చేశారు. నాగిరెడ్డి పదో తరగతితో కుస్తీ పట్టి ఇక వల్ల గాక వ్యవసాయం చేత కాక పట్నం చేరి ఆ పనులు ఈ పనులు చేస్తూ కాంట్రాక్టర య్యాడు. కాలేజి లెక్చరర్ రమను చూశాడు. ఒంటరిది తోడు లేనిది రమ అతడిని చూసింది. చిన్నది అయిన నాగమ్మ దగ్గరకొచ్చి రెండోపెళ్ళిచేసుకొంటానన్నాడు. పెళ్లై మూడేళ్ళు అయిన పిల్లలు లేక రెండో పెళ్లి అన్నాడు. సరే అంది. రమను రిజిష్టర్ పెళ్ళి చేసుకొన్నాడు. మెల్లిగా నాగమ్మకు కష్టం తెలియ సాగింది. పట్టు బట్టి పట్నం చేరింది. తన దగ్గర సేవలు పొందే భర్త రమకు సేవలు చేయటం నాగమ్మకు ఆశ్చర్యం. తనను తక్కువగా రమను అధికంగా చూడటం గుర్తించింది. కారణం నిలదీస్తే 'లెక్క జీతం చదువు' అన్నాడు. నాగమ్మ కూతురిని కంటే చూసేందుకు రాని నాగిరెడ్డి, రమ కొడుకును కంటే పల్లెలో ప్రచారానికి వచ్చాడు. 'Son preference affects women in many countries, particularly Asia its consequences can be anything from total or female infatanficide to angel neglect of girl child over her brother..'(Women's Human Rights, SeemaSharma, Kantha Sharma, p.no.135) నాగమ్మ విషయంలో ఇదే జరగటం చూడగలం కొడుకు పుట్టి ఇచ్చిన ఆనందం, కూతురు పుట్టటం వల్ల కలగక కూతుర్ని కన్న నాగమ్మ వివక్షకు గురి అయ్యింది. పిల్లల పట్ల అతడి కంటే రమే సమానంగా ప్రేమ చూపేది. నాగిరెడ్డి ఇంకా దూరం అవుతున్నాడని గ్రహించింది. ఈసందడిలోనే పది గట్టెక్కిన నాగమ్మ, రమ నచ్చ చెప్పినా మొగుడితో కాపురం వద్దనుకొంది, తన ఊళ్ళో ఉండి కాలేజికి వెళ్ళి చదువుకోవాలని నిర్ణయించుకొని రమతో 'నాక్కొపంలే దిగుల్లే పగల్లే... నీ మొగుని పల్లెకు రానీయకు' (పు. 27) అని వెళ్ళిపోయింది. స్త్రీకి చదువు ఉండాలి సంపాదన ఉండాలి. అవి లేకపోతే స్త్రీ జీవితం దుర్భరంగా ఉంటుంది. ఆమె అమాయకత పురుషుడి దోపిడికి కారణం అవుతుంది. ఇక్కడ నాగిరెడ్డిది అవకాశవాదం దోపిడి తత్త్వం. నాగమ్మ అతడిపై ఆధారపడటమే అతడు చులకన చేయటానికి కారణం. సంపాదన లేకపోవటమే వివక్షకు కారణం. పెద్ద భార్యగా కూడా గౌరవం లేదు. తాను వివక్షకు గురికావటం గుర్తించటం మాత్రమే కాదు, నాగమ్మ, తాను చదువుకోవాలి భవిష్యత్తు దిద్దుకోవాలని నిర్ణయించుకొంది. నాగిరెడ్డి ప్రవర్తన, నాగమ్మను నాగిరెడ్డికి దూరం చేస్తే, రమ ఆత్మీయత శత్రువులా భావించాల్సిన సపత్నికి ప్రేమగా దగ్గర చేసింది. అతడిని ఆమెకే వదిలేసేలా చేసింది. పల్లెటూరిది చదువురానిది, బిడ్డ తల్లి, అందునా ఆడపిల్ల తల్లి అయిన నాగమ్మ భర్తను వదిలేసింది.

ఈ పని చేయటానికి ఎన్ని భావాలను తెంపుకోవలసి వచ్చిందో, ఎంతటి హృదయ వేదనను అధిగమించ వలసి వచ్చిందో, ఎంతటి అవమానాన్ని వివక్షని దాటవలసి వచ్చిందో, ఎన్ని భయాలకు సమాధానం చెప్పుకోవలసి వచ్చిందో, భవిష్యత్తు ఇటువంటి స్థితితో ఎంత భయంకరంగా కనిపించిందో నాగమ్మ నాగిరెడ్డిని వద్దనుకొంది. వద్దనుకోవటం కినుకతో కాదని చెప్పింది. 'నాగమ్మ నిక్కచ్చిగా చెప్పింది. నన్నాడు పిలిచేకి లేదు. తలచేకి లేదు. ఆగింది. వస్తే పేణ్ణిళ్ళే పొరకేట్లే మెట్టేట్లే ' (పు. 27) అంది. ఇవి కఠినంగా ఖచ్చితంగా వచ్చిన మాటలు.

అక్షర జ్ఞానం లేని నాగమ్మకు చదువుకోవాలనే ఆలోచన, భర్తను వదిలేయాలి అనే నిర్ణయం రెండూ అతడి ప్రవర్తన వల్లే కలిగాయి. చదువుకొని ఉద్యోగం చేస్తున్న స్త్రీకి పురుషుడెలా సేవలు చేస్తాడో అతడిని చూసి గ్రహించింది. తనను మభ్యపెట్టి మోసం చేసి మరో వివాహం చేసుకొన్న వ్యక్తి తామిద్దరి పట్ల ఎలా వివక్ష చూపుతున్నాడో గ్రహించింది. చదువుకోని పల్లెటూరి నాగమ్మ పట్టణానికి వచ్చింది. ఇవన్నీ గ్రహించింది.

తన జీవితం అతడి దయా దాక్షిణ్యాలపై ఉండటాన్ని అంగీకరించలేక పోయింది. ఈ భావన ఎంత స్థిరంగా ఉందో కాని, హిందు వ్యవస్థ స్త్రీలలో రంగరించి రక్తంలో కలిపిన భర్త, వైవాహిక బంధం, సమాజం, భర్త వదిలేసిన స్త్రీ, వంటి ఎన్నో విషయాలను దాటి, భర్తను వదిలేయాలని నిర్ణయించుకొంది. ఈ నిర్ణయం వెనుక ఎవరి ప్రేరణ కాని అండ గాని లేదు. స్వయం నిర్ణయాధికారానికి నిదర్శనం నాగమ్మ.

**మిగిలినది తరువాతి సంచికలో.........**

అవగాహన సందర్భం

# బతుకు సూత్రాలు

- డా॥ శిలాలోలిత

మనుషులమైన మనం హాయిగా జీవించాలంటే మానవ సంబంధాలు మెరుగు పరుచుకోవాలంటే మనం కొన్ని ప్రయత్నాలు చేయాలి. కొన్ని ఆలోచనలు చేయాలి. కొంత శ్రమించాలి. కొంత మేరకు అవగాహన చేసుకోగలగాలి. ఈ మధ్య ఫేస్ బుక్ చూస్తున్నప్పుడు రమేష్ శ్రీ కొండగారు పెట్టిన పోస్ట్ చూసాను. మానవ సంబంధాలు అభివృద్ధి చెందాలంటే సైకాలజీ కౌన్సిలర్లు పది సూత్రాలు పాటించమంటారు. పాటించగలిగితే వారి దగ్గరకు మానసిక సమస్యలు రావు అన్నారు. అవి.

| | | |
|---|---|---|
| 1. ఎప్పుడు అనకూడని ఒక అక్షరం | - | ఐ (నేను) |
| 2. ఎల్లవేళలా అనాల్సిన 2 అక్షరాలు | - | వుయ్ (మనం) |
| 3. దగ్గరకు రానీయకూడని 3 అక్షరాలు | - | ఇగో (అహం) |
| 4. మనసా, వాచా ఉండాల్సిన 4 అక్షరాలు | - | లవ్ (ప్రేమాభిమానాలు) |
| 5. అన్నివేళలా ఉండాల్సిన 5 అక్షరాలు | - | స్మైల్ (చిరునవ్వు) |
| 6. తరచుగా అనాల్సిన 6 అక్షరాలు | - | థ్యాంక్స్ (కృతజ్ఞతలు) |
| 7. అలవర్చుకోవాల్సిన 7 అక్షరాలు | - | ఫర్‌గివ్ (క్షమాగుణం) |
| 8. దరికిరానీయకూడని 8 అక్షరాలు | - | జెలసీ (అసూయ) |
| 9. తప్పనిసరిగా చేయాల్సిన 9 అక్షరాలు | - | అడప్టబుల్ (రాజీపడాలి) |
| 10. అందరితో అవసరమయ్యే 10 అక్షరాలు | - | అండర్‌స్టాండ్ (అర్థంచేసుకోవాలి) |

ఈ పదిసూత్రాలను అర్థం చేసుకొని, అవగాహన కల్పించుకొని పాటించగలిగితే మనం ప్రతిక్షణం ప్రశాంతంగా ఉండగలుగుతాం. మాటలు మంత్రాలే కానీ, వైఖరి విరుద్ధంగా ఉంటే, చివరి దశలో చింతలు తప్పవు, కాబట్టి మన జీవితపు మలిదశలో అంటే చివరి దశలో సైతం ఆనందంగా గడిపి, మనం పోయిన తరువాత కూడా మన వారి మనసులో బతుకుతే ఉండే చిన్నచిన్న సహాయాలు చేయటం ప్రారంభిద్దాం. ముందుగా మానవ సంబంధాలు మెరుగుపరిచే ప్రయత్నం చేద్దాం.

ఎందుకంటే, అనుభవం నేర్పిన పాఠాలకు విలువ ఎక్కువ. ఆచరిస్తూ చెప్పే మాటలకు ఆదరణ ఎక్కువ. ఇష్టంతో చేసే పనులకు విజయాలు ఎక్కువ. ఎదుటివారిలో మంచినే చూసే మనసుకు ప్రశాంతత ఎక్కువ.

మనకు నిత్యజీవితంలో వేల సంఖ్యలో మనుషులు తారసపడ్తూనే ఉంటారు. విభిన్నమైన మనస్తత్వాలు మనకు తెలిసిపోతూనే ఉంటాయి. భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతూనే ఉంటాయి. మనకు ఎదురైన ప్రతి ఒక్కరిలోనూ లోపాలే వెతుకుతూ, ఒక నెగిటివ్ ధోరణిని అలవర్చుకుంటున్న వ్యక్తులే ప్రస్తుతం ఎక్కువవుతున్నారు. కాబట్టి ఒక పాజిటివ్ యాటిట్యూడ్‌ని అందరం ఏర్పరచు కోవాల్సిన సందర్భమిది. జీవితం క్షణికం అన్న చిన్న స్పృహ చాలు మనిషిగా బతకడానికి. రాత్రి వచ్చినంత సహజంగా పగలు వస్తూనే ఉంటుంది. ఒకదాని వెంట ఒకటి అలాతిరుగుతూనే ఉంటాయి. మనిషివెంట మనిషి తిరుగుతూనే ఉంటారు. స్త్రీ పురుషులిద్దరూ రాత్రింబగళ్ళు అనుకుంటే, కారుణ్యమూర్తులను ప్రాణసమానులు అనుకుంటే, భావసారూప్యత ఏర్పరుచుకుంటే, ఆధిక్యతల భావాలు విడనాడితే, సాటి ప్రాణిని గుర్తించగలిగే, అంగీకరించగలిగే సంస్కారవంతులే సమాజం నిండావుంటే ఇన్నీ సమస్యలు ఉత్పన్నం కావు. కానీ ఉత్పన్నమయిన సమాజమే మన కళ్ళముందు ఉందన్నది వాస్తవం. ఈ వాస్తవాన్ని అంగీకరిస్తూనే స్త్రీలు తమను తాము స్థిరీకరించుకునే దిశగా, హిమాలయ సదృశ్యమైన ఆత్మవిశ్వాసకేతనాలు ఎగరవేయగలిగే దిశగా పయనిద్దాం. మనం ముందుగా మనుషులం. మానవత్వం నింపుకున్న హృదయులం. ఆపైన పురుషులం. ఈ వివక్షలు పోయి మానవజీవితం సుఖమైన దిశగా పయనించే స్థితి కోసం భావ సారూప్యత ఉన్న వాళ్ళమందరం నిరంతరం కృషి చేద్దాం.



# ట్రిపుల్ 'తలాఖ్'ను నిషేధించండి

- జాతీయ మహిళా కమిషన్‌కు బీఎంఎంఏ విజ్ఞప్తి
- 50వేల మంది ముస్లింల సంతకాలు

మూడు సార్లు తలాఖ్ అని పలకడం ద్వారా ముస్లిం పురుషులు తమ భార్యలకు విడాకులిచ్చే 'ట్రిపుల్ తలాఖ్' పద్ధతిని రద్దు చేయాలంటూ ముస్లిం స్త్రీ_పురుషులు గళమెత్తారు. 'ఖురాన్‌కు విరుద్ధమైన' ఈ సాంప్రదాయాన్ని నిషేధించేందుకు చొరవ తీసుకోవాలని జాతీయ మహిళా కమిషన్‌కు విజ్ఞప్తి చేస్తూ 'భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్' (బీఎంఎంఏ) ఒక పిటిషన్‌ను రూపొందించింది. ఈ పిటిషన్‌పై దేశవ్యాప్తంగా సంతకాల సేకరణ క్యాంపెయిన్ కొనసాగుతోందని బీఎంఎంఏ సహ సంస్థాపకురాలు జకియా సోమన్ తెలిపారు. గుజరాత్, మహారాష్ట్ర, రాజస్థాన్, ఎంపీ, కర్ణాటక, తమిళనాడు, తెలంగాణ, ఒడిషా, పశ్చిమ బెంగాల్, బీహార్, ఝార్ఖండ్, కేరళ, యూపీలలో సంతకాలు సేకరణ జరుగుతోందని ఆమె చెప్పారు. 'ట్రిపుల్ తలాఖ్'ను రద్దు చేయాలనే డిమాండ్‌కు మద్ధతు తెలుపుతూ ఇప్పటి వరకు 50వేల మంది ముస్లిం స్త్రీ పురుషులు సంతకాలు చేశారు. రానున్న రోజుల్లో మరిన్ని సంతకాలను సేకరిస్తాం. సుదీర్ఘ కాలంగా ముస్లిం మహిళలు లేవనెత్తుతున్న ఈ డిమాండ్‌ను ఆమోదించాలని మేం మహిళా కమిషన్ చైర్‌పర్సన్ డాక్టర్ లలిత కుమారమంగళానికి లేఖ రాశాం' అని సోమన్ వివరించారు. బీఎంఎంఏ నిర్వహించిన ఒక అధ్యయనంలో 92 శాతం ముస్లిం మహిళలు ఈ దురాచారాన్ని అంతం చేయాలనే డిమాండ్‌కు మద్దతు తెలిపారు. కొన్ని సార్లు ఫోన్ ద్వారా, మెసేజ్‌ల ద్వారా, ఈ-మెయిల్స్ ద్వారా కూడా ఇలా ఏకపక్షంగా విడాకులిచ్చేస్తున్నారు. దీంతో మహిళలకు అన్యాయం జరుగుతోంది. నోటి దారా విడాకులిచ్చే పద్ధతికి తోడు, 'నికాహ్ హలాలా' అనే అచారం వల్ల కూడా మహిళలకు ఎలాంటి మనోవర్తి లభించడం లేదు. 'నికాహ్ హలాలా' ఆచారం ప్రకారం విడాకులైన భర్తను మళ్లీ వివాహం చేసుకోవాలంటే సదరు మహిళకు మరో వ్యక్తితో వివాహం, ఆపై విడాకులు జరిగి ఉండాలి. ట్రిపుల్ తలాఖ్ కేసులు విపరీతంగా ఉన్నాయని భోపాల్‌లో నివసించే సాదియా వఖాస్ అన్నారు. 'పురుషులు ఫేస్‌బుక్, ఎస్ఎంఎస్ సందేశాల ద్వారా కూడా మహిళలకు ఏకపక్షంగా విడాకులిస్తున్నారు. వారికి చట్టపరంగా హక్కు లేనప్పటికీ మత పెద్దలు (ఖజీలు) వారికే మద్దతునిస్తున్నారు.' అని ఆమె చెప్పారు. చాలా సందర్భాల్లో ఖాజీలే తాత్కాలిక భర్తలుగా వ్యవహరిస్తున్నారని బిఎంఎంఎకు చెందిన నూర్జహాన్ సాఫియా నియాజ్ అన్నారు. ఈ ఆచారాన్ని రద్దు చేయాలంటూ డెహ్రాడూన్‌కు చెందిన షాయరా బానో దాఖలు చేసిన పిటిషన్‌ను ఇటీవలే సుప్రీం కోర్టు విచారణకు స్వీకరించింది. 90రోజుల పాటు సాగే విడాకుల ప్రక్రియలో సయోధ్య, మధ్యవర్తిత్వానికి అవకాశం ఉండాలని బీఎంఎంఏ వాదిస్తోంది. 'ముస్లిం మహిళలు భారత పౌరులే కాబట్టి రాజ్యాంగపరమైన రక్షణ చర్యలన్నీ వారికీ వర్తిస్తాయి. వివక్షతో కూడిన ఆచారాలన్నింటినీ రద్దు చేస్తూ ముస్లిం పర్సనల్ లాను సంస్కరించాలి. ముస్లిం మహిళల రాజ్యాంగపరమైన, ఖురాన్ పరమైన హక్కులన్నింటినీ కాపాడాలి' అని బీఎంఎంఏ తన పిటీషన్‌లో పేర్కొంది.




ట్రిపుల్ తలాక్ ప్రెస్‌మీట్‌లో మాట్లాడుతున్న
బి.ఎం.ఎం.ఎ సభ్యులు జకియా సోమన్, నగ్మా షేక్, నూర్జహాన్



# దెయ్యం సినిమాలు - పరిశీలన

- మహతి

"నిను వీడని నీడను నేనే" పాట పాడుతూ అర్ధరాత్రి తెల్లచీర కట్టుకుని మాయమవుతూ, కనపడుతూ పాత సినిమాల్లో దెయ్యాలుండేవి. ఇటీవల కాలంలో కూడా కుప్పలు తెప్పలుగా దెయ్యం సినిమాలు వస్తున్నాయి. వీటిలో కొన్ని హిట్‌టాక్ కూడా వచ్చాయి. "ప్రేమకథా చిత్రమ్, గీతాంజలి, ముని, కాంచన, గంగ వంటివి. ముని, కాంచన, గంగ రాఘవ లారెన్స్ దర్శకత్వం వహించి నటించిన సినిమాలు. మరో ముందుకడుగేసి సీక్వెల్ తీస్తానంటున్నాడు. సినిమాలన్నింటిలోనూ దెయ్యం అంటే స్త్రీ. ఎక్కువగా స్త్రీ లే దెయ్యంగా మారతారు. పురుషులు ఎక్కువగా దెయ్యాలుగా మారరు. తీరని కోర్కెలుంటేనే దెయ్యాలుగా మారతారట. కాబట్టి స్త్రీలకే తీరని కోర్కెలుంటాయి. పురుషులకు తీరని కోర్కెలుండవేమో.

అంతకుముందు రామ్‌గోపాల్ వర్మ తీసిన సినిమాలలోనూ దెయ్యాలు స్త్రీలే. ఎందుకు స్త్రీలు మాత్రమే దెయ్యాలుగా మారుతున్నారు? సమాజంలో వారికే తీరని కోర్కెలు మిగిలిపోతాయా?

ప్రేమకథా చిత్రమ్ లో ఒక గెస్టుహౌస్‌లో ఎమ్మెల్యే కొడుకు అతని ఫ్రెండ్స్ తప్పతాగి అక్కడ కూలి పనిచేస్తున్న అమ్మాయిపై అత్యాచారం చేసి చంపేస్తారు. కానీ ఎమ్మెల్యే కొడుకు, ఫ్రెండ్స్‌కు ఏ శిక్షాపడదు, అసలు బయట ప్రపంచానికే ఆ విషయం తెలియదు. కొన్నాళ్ళకు ఆ స్త్రీ దెయ్యంగా మరొక స్త్రీలో ప్రవేశించి వారిని చంపుతుంది. కాంచన సినిమాలో ఒక హిజ్రా తను కష్టపడి సంపాదించిన డబ్బుతో స్థలం కొంటుంది. ఆ స్థలాన్ని ఒక రాజకీయ నాయకుడు కబ్జా చేస్తాడు. ఎదురుతిరిగిన ఆ హిజ్రాను చంపేస్తారు. హిజ్రా దెయ్యంగా మారి ఆ రాజకీయ నాయకున్ని మట్టుపెడుతుంది. గంగ సినిమాలో స్థానిక ఒక రౌడి మతిస్థిమితం లేని తన కుమారునికి హీరోయిన్‌ను ఇచ్చి పెళ్లి చేయాలని చూస్తాడు. ఎదురుతిరిగిన ఆమెను, ఆమె ప్రియున్ని రౌడీలు చంపేస్తారు. ఆమె దెయ్యంగా మారి ఆ రౌడీని మట్టుపెడుతుంది. గీతాంజలి సినిమాలో ఒక కంపెనీ బాస్ తనవద్ద పనిచేసే అమ్మాయిపై మోజుపడి అత్యాచారం చేసి చంపేస్తాడు. ఆమె దెయ్యంగా మారి వాడిని మట్టుపెడుతుంది. మయూరి, త్రిపుర, పిశాచి,పొగ సినిమాల్లోనూ స్త్రీలే అన్యాయంగా బలవుతారు. వారే దెయ్యాలుగా మారతారు. హీరో సూర్య నటించిన రాక్షసుడు, వారధి అనే సినిమాలు మరొక తరహాలో వచ్చాయి. ఈ సినిమాల్లో కొంతమంది కొన్ని కారణాలతో చనిపోతారు. ఆయా కుటుంబాలు ఇబ్బందులపాలవుతుంటాయి. చనిపోయిన వారు దయ్యాలుగా మారి హీరో దగ్గరకొచ్చి, ఆయనకు మాత్రమే కనపడి తమ కుటుంబాలను ఆదుకోమని కోరుతారు. హీరో ఆ సమస్యలను పరిష్కరిస్తాడు.

ఈ సినిమాలన్నీ పరిశీలిస్తే ఒక విషయం అర్థమవుతుంది. సమాజంలో ఒక అన్యాయం జరుగుతుంటే ఆ వ్యవస్థ దాన్ని సరిదిద్దాలి. అంటే తప్పు చేసినవారిని శిక్షించాలి. అది ప్రభుత్వమైనా శిక్షించాలి లేదా ప్రజలైనా అన్యాయాన్ని ఎదిరించాలి.నేడున్న సమాజంలో అలా జరగడంలేదు. సమాజం తన బాధ్యతను నిర్వర్తించాలి. ఎప్పుడైతే తన బాధ్యతను విస్మరిస్తుందో అప్పుడే ఇలాంటి అవాస్తవ పరిష్కార మార్గాలు చూపే సినిమాలు వస్తాయి. దెయ్యంగా మారి అన్యాయాన్ని సరిదిద్దటం.ఇదే సమస్య అసలు పరిష్కారంగా సినిమాలు ప్రబోధిస్తున్నాయి.ఈ సమాజంలో అన్యాయానికి గురైన వారిలో మొదటి స్థానంలో స్త్రీలుంటారు. కాబట్టే స్త్రీలే దెయ్యాలుగా మారుతున్నారు. దెయ్యంగా మారి కక్ష తీర్చుకునే ఘటనలు అవాస్తవాలు. అవాస్తవాలను వాస్తవాలుగా చూపెట్టి పరిష్కారం ఇదేనని చెప్పడం ఈ వ్యవస్థ సంస్కృతి.

గతంలో సూపర్ డూపర్ హిట్ అయిన చంద్రముఖి, అపరిచితుడు ఈ కోవలోకే వస్తాయి. చంద్రముఖి సినిమాలో హీరోయిన్ చిన్నప్పుడు కుటుంబంలో అనేక కష్టాలు పడుతుంది. వారి బంధువులు గానీ, చుట్టూ వున్న సమాజంగానీ పట్టించుకోకుండా వెలివేస్తుంది. దానితో ఆ అమ్మాయికి మతి స్థిమితం తప్పుతుంది. ఆ తరువాత చంద్రముఖి ఆవహించినట్లు చూపెడతారు. అపరిచితుడు సినిమాలో ప్రతి చిన్న విషయంలోనూ తప్పు జరగకుండా కరెక్టుగా, పద్ధతిగా ఉండాలని హీరో కోరుకుంటాడు. కానీ బయట సమాజంలో ఆ విధంగా జరగకపోయే సరికి మానసికంగా దెబ్బతింటాడు. రెండు సినిమాల్లోనూ వైద్యం పరిష్కారంగా చూపిస్తారు తప్ప సమాజం బాగుపడడానికి పరిష్కారం చూపరు.

ఇదీ నేటి దెయ్యం సినిమాల తీరు.

# ఉద్యమాల బాటలో..

**ఆత్మ రక్షణ శిబిరము**

యువతులకు ఆత్మరక్షణ శిబిరం తిరుపతి పట్టణంలో 5 రోజులు పాటు జరిగింది.

1. భూమి-పుట్టుక 2. మనిషి కథ 3. అసమానత్వం నుండి సమానత్వం వైపు 4. మహిళలు ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలు (విద్య, ఉపాధి, మద్యం) 5.పోషకాహారము- మానసిక సమస్యలు 6.ఇంటర్వ్యూలో పాల్గొనడం 7. మహిళల ఆత్మ విశ్వాసాన్ని ప్రస్ఫుటించిన సినిమాలు, సాహిత్యం, స్త్రీత్వం 8.చిత్రకళలు 9. మహిళలు-చట్టాలు 10. సంఘం ఏర్పాటు 11. కార్యాచరణ తదితర అంశాలపై 5 రోజులు 11 అంశాలపై బోధన, చర్చలు జరిగాయి. పుట్టుక తదితర అంశాలను తమ తరగతి గదుల్లో కంటే సజీవంగా తెలుసుకోగలిగామని సొంత కుటుంబ సభ్యుల నుండే లైంగిక వేధింపుల నెదుర్కొన్న సందర్భాలను, కుటుంబాలలోని ప్రేమరాహిత్యాన్ని, చదువుకు ఎదురవుతున్న ఆటంకాలను ఆయా చర్చలలో పాల్గొన్న అమ్మాయిలు సూటిగా పేర్కొన్నారు.

అద్భుత గాత్రం ఉన్న అమ్మాయిలతో పాటు అందరూ కలిసి పాడటాన్ని సాదరంగా స్వాగతించారు. సాధారణ పాటలు పాడి స్పీడు, రిథం వున్న పాటలు కావాలని కోరి ఉత్సాహంగా డాన్సులలో పాల్గొన్నారు.

అమ్మాయిలు ఎదుర్కొంటున్న సమస్యల మీద స్కిట్స్ వేయమని కోరినప్పుడు వారు కథకులు, శిక్షకులు యాక్షన్‌గా ఒక టీమ్‌లో మరో పోటీ పడి లఘు నాటికలను పండించారు.

ఐద్వా మొదటిసారిగా చదువుకుంటున్న అమ్మాయిలతో నిర్వహించిన ఈ శిబిరం కొత్త అనుభవాలను ఇచ్చింది. యువతరంలో వున్న ఆసక్తులను, ఆర్తిని ఆవిష్కరించింది. ముద్దారా నేర్పగా అన్నట్లు వారికి ఆత్మీయతతో, అనుభవాలతో కూడిన బోధన వారి మనసుకు హత్తుకుంది. సామాజిక మార్పులో తాము సైతం భాగస్వాములు కావాలని కోరుకుంటున్నారు. అందుకోసం అవకాశాలు వెతుక్కోవాలన్న ఆలోచన మొదలైంది.

ఈ క్లాసులలో ఎస్.వెంకట్రావు, మిరియం వెంకటేశ్వర్లు, డి.రమాదేవి, ప్రగతి, డా॥సుధాకర్ రెడ్డి, కిరణ్(ఎన్‌జిఒ) విష్ణు (మహిళా శక్తి), మోహన్( ఎమ్‌బిఏ ఫ్యాకల్టీ), జస్టిస్ రామ్‌మోహన్‌రావ్, జగన్, వెంకటరెడ్డి (ప్ర.నా.మండలి) నిర్మల, సాయిలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

తిరుపతిలో ప్రజాతంత్ర ఉద్యమం, ఎస్.ఎఫ్.ఐ, డివై.ఎఫ్.ఐ, ప్రజానాట్య మండలి సహకారంతో ఈ శిబిరం జయప్రదంగా జరిగింది.



**రౌండ్‌టేబుల్ సమావేశం:-**

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ఆధ్వర్యంలో "మహిళాభివృద్ధికి అనుగుణంగా బడ్జెట్ కేటాయించాలి" అను విషయంపై రౌండ్-టేబుల్ సమావేశం అన్ని మహిళా సంఘాల ఆధ్వర్యంలో జరిగింది. ఈ కార్యక్రమంలో ఐద్వా, ఎన్ఎఫ్ఐడబ్ల్యు, పిఒడబ్ల్యు, సంఘాల ప్రతినిధులు పాల్గొన్నారు. ఉమ్మడిగా ఆర్థికమంత్రికి మెమోరాండం పంపించారు. జిల్లాల్లో అధికారులకు మెమోరాండాలు ఇచ్చారు.

**మోటూరు ఉదయం వర్ధంతి సభలు:**

ఆధునిక సమాజంలో కూడా బయటికి వచ్చి పని చేయాల్సిన మహిళలు తీవ్రమైన వేధింపులను ఎదుర్కొంటు న్నారని, 70,80 సం॥ క్రితమే ఆడవాళ్ళు బయటకి రాని రోజుల్లో శ్రీమతి మోటూరు ఉదయంగారు మహిళా హక్కుల కొరకు కృషి చేశారని మోటూరు ఉదయం ట్రస్ట్ చైర్మన్ శ్రీమతి పుణ్యవతి గారు వర్ధంతి సభలో ఘనంగా నివాళులర్పించారు. స్త్రీలు చదువుకోవడమే గాక కుటుంబపోషణార్థం చిన్న, పెద్ద ఉద్యోగాల్లో చేరి పనిచేస్తున్నారని ఇంటిలోనూ వీధిలోనూ పని ప్రదేశంలోనూ వివిధ రూపాల్లో వివక్షతను, ఆంక్షలను వేధింపులను ఎదుర్కొంటున్నారని, మహిళా సంఘం రాష్ట్ర కార్యదర్శిగా



అవిశ్రాంతంగా పని చేసిన ఉదయం గారి మార్గంలో నడవడం ద్వారానే వాటిని ఎదుర్కోగలమని పేర్కొన్నారు. శ్రీమతి శాంతి అధ్యక్షత వహించగా కె.స్వరూప రాణి వక్తలను వేదిక పైకి ఆహ్వానించారు. బార్ కౌన్సిల్ మాజీ సభ్యులు, సీనియర్ న్యాయవాది శ్రీ సుంకర రాజేంద్ర ప్రసాద్ మహిళలు సాధించుకున్న చట్టాలను గురించి తెలియచేశారు. కుటుంబ హింస నిరోధ చట్టం సక్రమంగా వినియోగించినట్లయితే కుటుంబ సమస్యల్లో పరిష్కారాలు సాధ్యమవుతాయని తెలియజేశారు. అనేక చట్టాలున్నప్పటికీ అదనపు న్యాయస్థానాలు ఏర్పాటు చేయక పోవటంతో కేసుల విచారణలో తీవ్ర జాప్యం జరుగుతుందని ఆచరణలో చట్టాలు నిరుపయోగంగా మారుతున్నాయని ఆవేదన వెలిబుచ్చారు.

నిఖత అజాద్, తృప్తి దేశాయ్ లాంటి యువతులు స్త్రీలను అవమాన పరిచే సాంప్రదాయాలను ప్రశ్నిస్తున్నారని, అలాంటి దుస్సాంప్రదాయాలను ప్రతిఘటించడం వలనే ఆడపిల్లలు చదువుల్లో ఉద్యోగాల్లో రాణిస్తున్నారన్నారు. అమ్మాయిలు స్వేచ్ఛగా తమ విద్యా, ఉపాధి సదుపాయాలను పొందేందుకు ప్రతి ఒక్క అమ్మాయికి ప్రభుత్వం సైకిళ్ళను ఇవ్వాలని, రహదారుల్లో ప్రత్యేక సైకిల్ మార్గాలు రూపొందించాలని ఐద్వా రాష్ట్ర కార్యదర్శి రమాదేవి డిమాండ్ చేశారు. ఉదయం గారి కుమార్తె డా॥ ఉష, అల్లుడు డా॥ సుధాకర్, కృష్ణా జిల్లా అధ్యక్ష కార్యదర్శులు కె. శ్రీదేవి,,పి.విజయ, ఫ్యామిలీ కౌన్సెలింగ్ సెంటర్ కన్వీనర్ భారతి, సభ్యులు శారదా, సత్యవతి, వనలక్ష్మి తదితరులు పాల్గొన్నారు. పశ్చిమగోదావరి, అనంతపురం, నెల్లూరు జిల్లాల్లో వర్ధంతి సభలు జరిగాయి.

**మెప్మా (పట్టణ ప్రాంత డ్వాక్రా గ్రూపులు) మహిళల రాష్ట్ర సదస్సు:**

పేదరిక నిర్మూలన, మహిళా సాధికారత లక్ష్యాలుగా ఏర్పాటు చేయబడిన స్వయం సహాయక గ్రూపు సభ్యులు ప్రభుత్వ విధానాలతో అష్టకష్టాలకు గురవుతున్నారు. స్వతంత్రంగా నడవాల్సిన సంఘాలు తమ పొదుపు డబ్బు తాము ఉపయోగించుకునేందుకు కూడా ఆంక్షలు ఎదుర్కొంటున్నారు. సక్రమంగా ఋణాలు చెల్లిస్తూ ఋణ చెల్లింపులలో అగ్రభాగాన ఉన్న ఎస్‌హెచ్‌జిలు టిడిపి ఋణమాఫీ వాగ్దానంతో అస్తవ్యస్థమయ్యాయి. బ్యాంకుల నుండి తక్కువ వడ్డీకి లభిస్తున్న ఋణసదుపాయం ఉపయోగించుకుంటే గుడ్డిలో మెల్లన్న అనుభవం, విశ్వాసంతో మహిళలు తిరిగి అధికవడ్డీలు చెల్లించి ఋణాల చెల్లింపుకు పూనుకున్నారు.

కానీ ప్రభుత్వం మార్కెట్ ఆధారంగా ఎన్‌ఆర్ఎల్ఎం పథకాన్ని ఎస్‌హెచ్‌జిలకు ముడిపెట్టటంతో కొత్త సమస్యలు ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వం చెల్లించిన రూ॥3,000లతో సహా



మహిళల పొదుపు డబ్బును సైతం వినియోగించుకోనివ్వకుండా బ్యాంకు అధికారులు అడ్డం పడుతున్నారు. ప్రభుత్వం డ్వాక్రా మహిళలకు సహాయం చేయకపోగా ఆ మహిళల పొదుపు డబ్బు (సుమారుగా 4,000కోట్లు)ను వడ్డీ లేకుండా బ్యాంకులు, ప్రభుత్వం ఉపయోగించుకుంటున్నాయి. ప్రశ్నించిన వారిపై కక్షగడుతున్నారు. అధికార పక్షం వారు మహిళలను రాజకీయ సమీకరణలకు ఉపయోగించుకుంటున్నారు.

మహిళలచేత ధాన్యం కొనుగోళ్ళు, ఇసుక క్వారీల నిర్వహణ తదితర పనులు చేయించుకుంటూ సం॥రాల తరబడి వారికి రావల్సిన కమిషన్లను విడుదల చేయటంలేదు. ఋణాలపై వడ్డీ విడుదల చేశామని చెప్తున్నా సగం పైగా గ్రూపులకు వడ్డీ జమ

కాలేదు. పోలవరం ముంపు మండలాల్లో ఒక్కరికంటే ఒక్కరికి కూడా వడ్డీ జమకాలేదు.

నెలనెలా రకరకాల పొదుపులు జత చేసుకుంటూ పోతూ గ్రూపు పొదుపు, సమాఖ్య పొదుపు, స్త్రీనిధి పొదుపు, ఆరోగ్య పొదుపు లాంటి రకరకాల పేర్లతో వసూళ్ళు చేస్తున్నారు. వాటికి జమా ఖర్చులు చెప్పరు. అభయహస్తం, ఆమ్ ఆద్మీ, జనశ్రీ యోజన లాంటి స్కీములకు బాండ్లు ఇవ్వరు. సమాఖ్యలో అన్ని గ్రూపులు కడితే తప్ప ఋణం చెల్లించిన వారికి కూడా తిరిగి లోన్లు చెల్లించడంలో కొన్ని బ్యాంకులు ఇబ్బంది పెడ్తున్నాయి. రకరకాల ఖాతాలు ఓపెన్ చేయిస్తున్నారు.

గ్రూపు సభ్యుల సమస్యలు విని పరిష్కరించటానికి ప్రయత్నం లేకపోగా అలాంటివారిపై కక్షసాధింపుకు పూనుకుంటున్నారు. వారికి తగిన అవగాహన, గ్రూపులను స్వయంగా నిర్వహించు కునేందుకు సహకారం, స్వతంత్ర నిర్ణయాలు తీసుకునేందుకు అవసరమైన సమాచారాన్ని, శిక్షణను అందించేందుకు పూనుకోవాలి. ఉపాధి, మార్కెటింగ్, సామాజిక కార్యకలాపాలలో చొరవ పెరిగితేనే లక్ష్యాలు నెరవేరతాయి. అందుకొరకు ఈ దిగువ చర్యలు తీసుకోవల్సిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాము. బ్యాంకులకు నిజమైన కస్టమర్ దేవుళ్ళు స్వయం సహాయక సభ్యులు. వారికి తగిన గౌరవం ఇచ్చి అవగాహన కల్పించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. లక్షలాదిగా సంఘటితపడిన డ్వాక్రా మహిళలు ఆత్మ విశ్వాసంతో సంఘటితంగా సమస్యలను పరిష్కరించుకునేందుకు ఐద్వా వారికి అండగా నిలబడ్తుందని తెలియచేస్తూ సదస్సులో తీర్మానం ప్రవేశపెట్టడమైనది.

ఈ సదస్సుకు ముఖ్య అతిధిగా హాజరైన డ్వాక్రా గ్రూపుల అఖిల భారత సమన్వయం కమిటీ కన్వీనర్ తపశి ప్రహరాజ్ మాట్లాడుతూ డ్వాక్రా గ్రూపులు సంఘటితంగా నడుస్తున్నాయిని, అలాగే బ్యాంకులకు వెళ్ళి చాలా పట్టుదలగా లావాదేవీలు నడుపుతున్నారు. కానీ ఈ గ్రూపులపై దేగకన్ను పండింది. దాన్ని నిర్వీర్యం చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది. 16 కమిటీలతో బహుళజాతి కంపెనీలతో ఒప్పందం చేసుకుని డ్వాక్రా ద్వారా వాళ్ళ దళారులు గ్రూపు సభ్యలను ఒప్పించి వ్యాపారం చేయడానికి ప్రయత్నం చేస్తోంది. ఇదే కాకుండా ఎన్ఆర్ఎల్ఎమ్ కింద ఎ.పి లో 5 జిల్లాల్లో అమలు జరుపుతోంది. దీనివలన డ్వాక్రా సొమ్మును పెద్ద బహుళజాతి సంస్థల అధీనంలోకి నెట్టివేయడానికి ప్రయత్నం చేస్తోంది. ఢిల్లీ, మహారాష్ట్ర వంటి రాష్ట్రాలలో కూడా ఇది కొనసాగుతోంది. ఇదేనా మహిళా సాధికారత? అని ప్రశ్నించారు.

ఎన్ఆర్ఎల్ఎం ద్వారా గ్రూపులను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నం చేస్తుంది. విఏఓల ఎంపికను గతంలో ప్రభుత్వమే నియమించింది. కానీ వారికి జీతాలను సమాఖ్యలను ఇమ్మంటున్నారు. డ్వాక్రా గ్రూపుల సమస్యలపై నిరంతరం పోరాటం చేయాలని పిలుపునిచ్చారు.

ఎస్‌బిహెచ్ ఎజిఎం త్యాగరాజన్ మాట్లాడుతూ గ్రూపు సభ్యులు సంఘాలను సక్రమంగా నడపాలని, గ్రూపులు తమ ఆర్థికావసరాల కోసం ప్రైవేటు వ్యక్తులపై ఆధారపడకుండా బ్యాంకులు పనిచేస్తున్నాయని, సమస్యలు ఉంటే అధికారులకు తెలియజేయమని తమ వంతుగా సహకరిస్తామని అన్నారు. ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం ఎన్నికల కోసం, ఓట్ల కోసం డ్వాక్రా మహిళలను ఉపయోగించుకుని ఎన్నికల అనంతరం మోసం చేసిందని, ఋణమాఫీ పేరుతో డ్వాక్రా మహిళల్ని అప్పుల పాలు చేసిందని మన శక్తి సామర్థ్యాలను, నైపుణ్యాలను పెంచుకోవడం ద్వారా గ్రూపులను బలోపేతం చేసుకోవాలని పిలుపునిచ్చారు. డ్వాక్రా సమన్వయ కమిటీ కన్వీనర్ కె. స్వరూపరాణి తీర్మానం ప్రవేశపెట్టారు. 239 మంది మహిళలు 10 జిల్లాల నుండి పాల్గొన్నారు. ఆయా ప్రాంతాల నుండి హాజరైన మహిళలు తాము బ్యాంకుల నుండి ఎదుర్కొంటున్న సమస్యలపై చర్చించారు.

ఈ కార్యక్రమంలో ప్రభావతి అధ్యక్షత వహించగా ఎస్‌బిహెచ్ చీఫ్ మేనేజర్ టి. కోటయ్య, ఆంధ్రా బ్యాంకు మేనేజర్ జె. నాగసాయి, కె.శ్రీదేవి మరియు ఇతర ఆఫీస్ బేరర్లు పాల్గొన్నారు.

**విజయనగరం:** అంబేద్కర్ జయంతి సందర్భంగా 5 దళితవాడల్లో సదస్సులు 150 మందితో జరిగాయి. మే 5,6,7, తేదీల్లో 50 మంది కార్యకర్తలకు క్లాసులు నిర్వహించారు. మంచినీళ్ళ సమస్య మీద బొబ్బిలి, పార్వతీపురంలో 70 మందితో ధర్నా నిర్వహించారు. విజయనగరం జిల్లాలో 100 గ్రూపులను కలిసి సర్వే చేశారు. 5000 కరపత్రాలు వేసి ప్రచారం చేశారు. 3 కేంద్రాలలో జరిగిన ధర్నాలలో 500 మంది పాల్గొన్నారు. బ్యాంకు, వెలుగు అధికారులతో తహసీల్‌దార్ ఉమ్మడి సమావేశం నిర్వహించారు. కొన్ని సమస్యలు పరిష్కరించబడ్డాయి. డ్వాక్రా సమస్యలు పరిష్కరించాలని కోరుతూ ముఖ్యమంత్రికి 1200 సంతకాలతో పిటీషను పంపించాము. మార్చి 8 సభలు 10చోట్ల జరిగాయి. 500

మంది హజరయ్యారు. సామాజిక యాత్రలో 6 వార్డుల్లో 200 మహిళలు పాల్గొన్నారు

**విశాఖ జిల్లా :** అంబేద్కర్ జయంతి కార్యక్రమాల్లో 7 చోట్ల పాల్గొన్నారు. ఆనందపురం ఎస్.సి కాలనీలో స్థానిక సమస్యలపై మీటింగు నిర్వహించారు. బ్రాండిక్స్ మహిళా సమస్యలపై ధర్నాలో, పికెటింగ్‌లలో పాల్గొన్నారు. గ్రామాల్లో సమావేశాలు నిర్వహించారు. దివీస్ పోరాటంలో మహిళా సంఘం పాల్గొన్నది.

**విశాఖ సిటీ:** పోలీసు ఎసిపి ఒక మహిళను మోసం చేసినదానికి నిరసనగా అతనిని సస్పెండ్ చేయాలని 35 మందితో కలిసి సిపికి, కలెక్టర్‌కు మెమోరాండం ఇవ్వటం జరిగింది. గాజువాకలో కొత్తసంబంధాలతో పిక్‌నిక్ పెట్టాము. దీనిలో 70 మంది పాల్గొన్నారు. డ్వాక్రా సదస్సు ప్రిపరేషన్ గురించి కరపత్రాలు వేయటం జరిగింది. 3 డివిజన్‌లలో డ్వాక్రా సదస్సులు జరిగాయి. వీటిలో 110 మంది పాల్గొన్నారు. అంబేద్కర్ జయింతి సందర్భంగా ప్రజాసంఘాలతో కలసి క్యాండిల్ ర్యాలీ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 150 మంది పాల్గొన్నారు. పాటలు నేర్చుకొని పాటలు, మరియు 'మార్పు' అనే నాటికను ప్రదర్శించారు. ఈ సందర్భంగా 9 జోన్స్‌లో మహిళా సంఘం కెవిపిస్‌తో కలసి సామాజిక చైతన్య యాత్రలు నిర్వహించారు. ఉగాది రోజున ఉగాది పచ్చడి పంచారు. శ్రీరామ నవమికి 1 జోన్‌లో మజ్జిగ ఏర్పాటు చేశారు. డ్వాక్రా రాష్ట్ర సదస్సులో 63 మంది పాల్గొన్నారు. ఏప్రిల్ 22న బ్రాండిక్స్ కంపెనీ నిర్బంధాన్ని నిరసిస్తూ కంపెనీ కార్మికులకు మద్దతుగా ఐద్వా, పి.ఓ.డబ్ల్యు, ఎన్.ఎఫ్.ఐ.డబ్ల్యు కలిసి గాంధీబొమ్మ దగ్గర నల్ల రిబ్బన్స్ కట్టుకొని 30 మంది ఐద్వాగా నిరసనలో పాల్గొన్నారు. బ్రాండిక్స్ కంపెనీపై ప్రభుత్వం చర్యలు తీసికోవాల్సిందిగా కోరుతూ డిఆరోఓ మరియు సెజ్ అధికారులకు మెమోరాండం ఇచ్చారు. బ్రాండిక్స్ సమస్యపై మహిళల అరెస్ట్‌లను నిరసిస్తూ కలెక్టర్ ఆఫీసు వద్ద ధర్నా నిర్వహించటం జరిగింది. మొత్తం 55 మంది పాల్గొనగా, వీరిలో ఐద్వాగా 35 మంది మహిళలు పాల్గొన్నారు.

ఆత్మరక్షణ క్యాంపెయిన్ 8,9,10 తరగతుల విద్యార్థులతో నిర్వహించారు. ఒక జోన్‌లో యోగా కూడా నేర్చుకుంటున్నారు. 20 మందితో స్టడీసర్కిల్ జరుగుతుంది. అరకులో జిల్లా తరగతులు నిర్వహించారు. 150మంది హాజరయ్యారు.

**తూ॥ గోదావరి: ఉపాధి హామీ:-** తూర్పుగోదావరి జిల్లా



ఐద్వా కార్యదర్శి రమణి నాయకత్వంలో ఐద్వా బృందం బండారులంక గ్రామంలో జరుగుతున్న ఉపాధి పనులను పరిశీలన చేశారు. ఆ గ్రామంలో మొత్తం 38 గ్రూపులు ఉన్నాయి. 300 మంది కూలీలు వున్నారు. 80% మంది మహిళలు వంద రోజులకు పైగా పనిచేసిన 20 గ్రూపులను ట్రిబుల్ ఎస్‌టి గ్రూపులుగా గుర్తించారు. మగవాళ్ళలో పనిచేయనివారు, ముసలివారు మాత్రమే ఉపాధి పనులకు వస్తున్నారు. రోజువారీ 99 నుండి 130 వరకు కూలీగా పొందుతున్నారు. రోజూ 5,6 గంటలు పనిచేస్తున్నారు. ప్రభుత్వం ప్రకటించిన 194 రూపాయలు పొందాలంటే 3.80 మీటర్ల పొడవు, 1.70 మీటర్ల వెడల్పు 0.3 మీటర్ల లోతు తవ్వాలి. ఏప్రిల్ నెలలో సమ్మర్ అలవెన్సు ఇవ్వలేదు. గునపాలు, పారలు, టేపులు, మెడికల్ కిట్లు తదితర వస్తువులు అవసరమైన మేరకు ఇవ్వడం లేదు. మజ్జిగకు కూడా 3 రూపాయలు ఇవ్వడంతో నీళ్ళు తప్ప మజ్జిగ అందడం లేదు. టెంట్‌లు వంటివి కూడా ఏర్పాటు చేయడం లేదు. కష్టానికి తగిన వేతనం దక్కకపోవడమే గాక వేతనాలు సరిగా చెల్లించడం లేదని ఆవేదన వెలిబుచ్చారు.

**సామాజిక యాత్ర :**

అంబేద్కర్ 125వ జయంతి సందర్భంగా తూర్పుగోదావరి జిల్లాలో జీపు జాతరలు 4 రోజులు జరిగాయి. రాజమండ్రిలో ఒక అమ్మాయి మీద జరిగిన గ్యాంగ్‌రేపుకు నిరసనగా రాజమండ్రిలోనూ, కాకినాడలోనూ ధర్నా జరిగింది. అమలాపురం, పిఠాపురం ప్రాంతాలలో 300 డ్వాక్రా గ్రూపులను మహిళా కార్యకర్తలను కలిసి సర్వే నిర్వహించారు. 5చోట్ల సదస్సులు జరిగాయి. ఈ సదస్సుల్లో 150 మంది పాల్గొన్నారు. 3చోట్ల అధికారులతో చర్చలు జరిపి కొన్ని సమస్యలు




పరిష్కరించుకొన్నారు. తూర్పుగోదావరి జిల్లాలో 30 చోట్ల అంతర్జాతీయ మహిళా దినోత్సవాలు జరిగాయి. 3000 మంది మహిళలు హాజరయ్యారు. ఐద్వా, శ్రామిక మహిళా సంఘం కలిపి నిర్వహించారు.

**ప॥ గో:-** 13 కేంద్రాలలో 460 మందితో డ్వాక్రా సమావేశాలు జరిగాయి. మార్చి 8 సందర్భంగా 28 కేంద్రాలలో సభలు జరిగాయి 2000మంది పాల్గొన్నారు. ఎర్రా అబద్ధం, ఏలూరు వెంకటరత్నంగార్ల సంస్మరణ సభలు పాలకొల్లులో జరిగాయి. ఏలూరులో 8 ఏళ్ళ బాలికపై జరిగిన అత్యాచారాన్ని ఖండిస్తూ ధర్నా నిర్వహించాము. చాటపర్రులో ఒక అమ్మాయిపై కిరోసిన్ పోసి చంపిన ఘటంలో ఎస్ఎఫ్ఐ ఐద్వా కలిసి ర్యాలీ చేసి రాస్తా రోకో చేశాము. తల్లిదండ్రులకు 2 లక్షల నష్టపరిహారం చెల్లించారు.

**గుంటూరు:** ఎడ్లపాడులో ఒక వివాహితురాలిపై జరిగిన అత్యాచారం కేసులో 25వేల రూపాయలు నష్టపరిహారం మనము కెవిపిఎస్ కలిపి చేసిన కృషితో ఇచ్చారు. డ్వాక్రా మహిళల సర్వే 2 చోట్ల చేశారు. రాజుపాలెంలో సామాజిక యాత్ర సందర్భంగా ఇళ్ళు వేయించారు. ఇళ్ళు తొలిగించి కేసు పెట్టారు.

**ప్రకాశం :** సామాజిక చైతన్యయాత్రలో ఐద్వాగా పాల్గొన్నారు. మార్చి 8 నాలుగు చోట్ల నిర్వహించారు.

**కృష్ణా :** ఈస్ట్-1 జోన్‌లో జెండా ఆవిష్కరణలో 30 మంది పాల్గొన్నారు. వెస్ట్-1 జోన్, సెంటర్‌లో 2 జోన్‌లలో జోన్ మహాసభలు జరిగాయి. మార్చి నెలలో కుట్టుమిషన్ సెంటరు ఆధ్వర్యంలో 2 సదస్సులు 100 మందితో జరిగాయి. ఈ సదస్సుకు సిఐటియు నాయకురాలు ధనలక్ష్మి పాల్గొన్నారు.

జక్కంపూడి కాలనీలో, వెస్ట్-1 జోన్‌లో డ్వాక్రా సదస్సుకు 120, 40 మంది పాల్గొన్నారు. జక్కంపూడి కాలనీలో ఐద్వా మహాసభ 150 మందితో జరిగింది. జక్కంపూడి కాలనీలో పౌరసంక్షేమ సంఘం ఆధ్వర్యంలో స్థానిక సమస్యలపై 300 మందితో ధర్నా చేశారు.

స్వరాజ్య మైదానం ప్రైవేటీకరణకు నిరసనగా ఐద్వా, డివైఎఫ్ఐ, టాక్స్ పేయర్స్ సంఘాల ఆధ్వర్యంలో రాఘవయ్య పార్కు నుండి లెనిన్ సెంటరు వరకు నిరసన ప్రదర్శన 50 మందితోను, మరోసారి 40 మందితోను జరిగింది.

కార్పొరేటర్ల పర్యటన సందర్భంగా మహిళల పట్ల టిడిపి నాయకుల అసభ్య ప్రవర్తనకు నిరసనగా ఐద్వా, ఎన్.ఎఫ్.ఐ. డబ్ల్యు, పి.ఓ.డబ్ల్యు ఆధ్వర్యంలో 4 గంటలపాటు మున్సిపల్ ఆఫీసు వద్ద ధర్నా, నిరసన, ముట్టడి 50 మందితో జరిగింది. 18 మంది మహిళా కార్యకర్తలను అరెస్ట్ చేశారు. శాంతి స్పృహ కోల్పోవటం జరిగింది. దీనికి నిరసనగా 2 సార్లు ప్రెస్‌మీట్ పెట్టటం జరిగింది. గవర్నమెంటు హాస్పటల్‌లో పసికందుకు చీమలు కుట్టి చనిపోయినదానికి నిరసనగా గవర్నమెంటు హాస్పటల్ ఎదుట నిరసన, కలెక్టర్ కారు ముట్టడిలో ఐద్వా కూడా పాల్గొంది.

15 రోజుల పాటు సమ్మర్ క్యాంపు జరిగింది. 45 మంది అమ్మాయిలు పాల్గొన్నారు. ఈ క్యాంపులో కరాటే శిక్షణ, "భూమిపుట్టుక", "మనిషికథ", "మద్యం వలన నష్టాలు", "మూఢనమ్మకాలు", "ఆడపిల్లల విద్యా అవకాశాలు", "మహిళలు -అభ్యుదయ భావాలు" మొదలగు అంశాల మీద క్లాసులు నిర్వహించటం జరిగింది. మే 20 వ తారీకుతో క్యాంపు ముగిసినది. పడమటలంక పుట్టరోడ్డులో కార్యక్రమాలు నడుస్తున్నాయి.

**నెల్లూరు :** సామాజిక చైతన్యయాత్రలలో 6 మండలాల్లో కెవిపిఎస్, ప్రజానాట్యమండలి, వ్యవసాయ కార్మిక సంఘం మొదలగు ప్రజాసంఘాలతో కలిసి పాల్గొన్నారు. దీనిలో 100 మంది దాకా పాల్గొన్నారు. అంబేద్కర్ జయంతి సందర్భంగా సదస్సు 200 మందితో సదస్సు నిర్వహించాము. ప్రజాసంఘాలతో ధాన్యానికి మద్దతు ధర ఇవ్వాలని జరిగిన ప్రదర్శనలో మహిళలు 500 మందిపాల్గొన్నారు. ఉదయంగారి

వర్ధంతి సభలో 50 మంది పాల్గొన్నారు. పొదుపు మహిళల సదస్సు 250 మందితో నిర్వహించారు. మేడే సందర్భంగా 1000 మంది మహిళలు పాల్గొన్నారు. జ్యోతిబా పూలే మరియు జగజ్జీవన్‌రామ్ గార్ల జయంతి సందర్భంగా పూలమాలలు వేసి ప్రదర్శన 400 మందితో చేశాము. విజయవాడకు పొదుపు సదసులో 70 మంది పాల్గొన్నారు. తెలుగుదేశం కార్పొరేటర్ అసభ్య ప్రవర్తనకు వ్యతిరేకంగా ప్రెస్‌మీట్ పెట్టటం జరిగింది.

**చిత్తూరు :** డ్వాక్రా సంఘాల సమస్యల మీద కమీషనర్‌కు మెమోరాండం ఇచ్చారు. శివరాత్రి సందర్భంగా డ్వాక్రా సమాఖ్యతో కలిసి ఆటల పోటీలు నిర్వహించారు. కల్చరల్ నైట్ జరిగింది.

**అనంతపురం:** మోటూరు ఉదయం గారి వర్ధంతి సభ 3 సెంటర్లలో జరిగింది. 1సెంటరులో రోగులకు బ్రెడ్ పంచారు. ఏప్రిల్‌లో ఉగాది సందర్భంగా కవి సమ్మేళనం జరిగింది. 16 మంది మహిళా రచయితలు పాల్గొన్నారు. గుత్తిలో మంచినీళ్ళ సమస్యపై ధర్నా జరిగింది. 30 మంది హాజరయ్యారు. పుట్టపర్తిలో 3 రోజుల పాటు రాజకీయ తరగతులు నిర్వహించారు. 70మంది హాజరయ్యారు.



**కర్నూలు :**

నగరంలో తాగునీరు, మురుగుదొడ్లు మరియు రోడ్ల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ మున్సిపల్ ఆఫీసు వద్ద ధర్నా మరియు ఘొరావ్ నిర్వహించారు. జొహరాపురంలోని కొత్త కొట్టాల ప్రాంతంలో మంచినీటి సమస్య తీవ్రంగాం వుందని ట్యాంకర్ల ద్వారా మంచినీటిని సరఫరాచేయాలని డిమాండ్ చేశారు. స్టాంటన్‌పురంలోని మమత నగర్‌లో మురుగుదొడ్ల, మంచినీరు రోడ్ల సమస్య తీవ్రంగా ఉందని, పచ్చబిల్డింగ్ కాలనీలో అరగంట మాత్రమే నీళ్ళు వదులుతున్నారని ఈసమస్యలను పరిష్కరించానట్లయితే ఉధృతంగా ఆందోళన చేస్తామని హెచ్చరించారు. కమీషనర్ కొన్ని సమస్యలన వెంటనే పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర ఉపాధ్యక్షురాలు నిర్మల, జిల్లా కార్యదర్శి అలివేలు, జిల్లా నాయకులు సుజాత , ధనలక్ష్మి, కమ్రూన్, లత, సరస్వతి, రేణుక, ఎల్లమ్మ, సీతమ్మ, రుద్రమ్మ, తదితరులు పాల్గొన్నారు. అన్ని ప్రాంతాల నుండి 200మంది హాజరు అయ్యారు. జిల్లా రాజకీయ శిక్షణా శిబిరం 3 రోజులు జరిగింది. 80మంది హాజరయ్యారు.

**చిన్నారులపై అఘాయిత్యాలను నిలువరించాలి**

చిన్నారులపై జరుగుతున్న అఘాయిత్యాలను నిలువరించే చర్యలు ప్రభుత్వం తేసుకోవాలని ఐద్వా నగర కార్యదర్శి కె. శ్రీదేవి అన్నారు. సింగ్‌నగర్ ఏరియాలో ఇటీవల ఓ బాలికపై లైంగిక దాడి క్రమంలో ఆ బాలికను వన్‌టౌన్ షేక్ రాజా ఆసుపత్రి ప్రాంగణంలో ఏర్పాటు చేసిన ఆవాస కేంద్రంలో మంగళవారం ఐద్వా నేతలు పరామర్శించారు. ఈ సందర్భంగా అధికారులతో మాట్లాడి ఆ బాలికను, ఆమె చెల్లెలను సైతం చైల్డ్ కేర్ సెంటరులో చేర్పించారు అదే విధంగా బాలిక సోదరుదుని స్కూల్‌లో చేర్పించి చదువు చెప్పించే విధంగా చర్యలు తీసుకున్నారు. ఈ సందర్భంగా శ్రీదేవి మాట్లాడుతూ సింగ్‌నగర్ ప్రాంతంలో ఈ మధ్య కాలంలో చిన్న పిల్లలపై అత్యాచారాలు పెరుగుతున్నాయన్నారు. ఆడపిల్లలకు రక్షణగా ఉండాల్సిన తండ్రులే తమ కూతుళ్ళ పట్ల లైంగిక దాడులకు పాల్పడుతున్న తీరు విచారకరమన్నారు. క గత నాలుగు రోజుల క్రితం రాజీవ్‌నగర్ 15 సంవత్సరాల బాలికపై ఆమె తండ్రి అత్యాచారానికి పాల్పడిన ఘటన వెలుగులోనికి వచ్చిందన్నారు. తాగుడుకు బానిసలైన వ్యక్తులు ఈ రీతిలో అత్యాచారాలకు పాల్పడుతున్న ఘటనలు అనేకం ఉంటున్నాయన్నారు. వాంబే కాలనీలో ఇటువంటి ఘటనలు 4,5 చోట్లు చేసుకున్నాయన్నారు. ఇటువంటి ఘటనలు జరగకుండా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని, చిన్నారులను రక్షించాలని కోరారు. ఐద్వా సింగ్‌నగర్‌జోన్ కమిటీగా వారికితగు న్యాయం జరిగేలా పోరాటం చేస్తున్నట్లున్నారు.

**పుస్తకావిష్కరణ సభ**

2016 ఏప్రిల్ 19న కాటూరు గ్రామంలో "రాజేశ్వరమ్మ – జ్ఞాపకాలు" పుస్తకావిష్కరణ సభ ఘనంగా జరిగింది. నూరేళ్ళ నిండు జీవితంలో కామ్రేడ్ రాజేశ్వరమ్మ స్ఫూర్తి దాయకమైన

పాత్రను వారు రాసుకున్న డైరీ ఆధారంగా రాజేశ్వరమ్మ - జ్ఞాపకాలు పుస్తకాన్ని కృష్ణా జిల్లా కమిటీ ప్రచురించి ఆవిష్కరించింది. ఈ ఆవిష్కరణ సభలో కామ్రేడ్ పి.మధు, పుణ్యవతి, అన్నే అనసూయ, వడ్డే శోభనాద్రీశ్వరరావు, డా॥పి.చంద్రశేఖర్ రావు, నాగళ్ళ శివప్రసాద్‌గారు, డా॥ ఎస్.కె.ఎస్.ఎన్. ప్రసాద్, స్వరూపరాణి, రమాదేవి, శ్రీదేవి, పి.విజయ తదితరులు పాల్గొన్నారు. రాజేశ్వరమ్మ గారి కుటుంబ సన్నిహితులు, పార్టీ మరియు మహిళా సంఘం కార్యకర్తలు పెద్ద ఎత్తున పాల్గొన్న ఈ సభలో రాజేశ్వరమ్మ గారి కుమార్తె డా॥జ్యోతి వారి యెడల తీసుకుంటున్న అనన్య సామాన్యమైన శ్రద్ధను వక్తలు ప్రత్యేకంగా అభినందించారు. జీవిత కాలం ప్రజాహితం కోసం, కష్ట జీవుల రాజ్యంకోసం ధైర్యంగా నిలిచి పోరాడిన రాజేశ్వరమ్మ గారి ఆదర్శప్రాయమైన కృషి అనుసరణీయమని నొక్కి వక్కాణించారు.

**అరకులో గిరిజన మహిళల సమావేశం** మే 26వ తేదీన ఐద్వా రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు రమాదేవి, ప్రభావతి స్థానిక గిరిజన నాయకురాలు గీత పెదలవుడు గ్రామాన్ని సందర్శించారు. ఈ గ్రామాన్ని ముఖ్య మంత్రి దత్తత తీసుకున్నారు. కానీ గ్రామంలో అలాంటి ఆనవాళ్ళు ఎక్కడా లేవు. మురుగు పారుదల సౌకర్యం లేక కంపుకొడుతున్న పరిస్థితులున్నాయి. రోడ్లు లేవు. హుదూద్ తుఫానులో నష్టపోయిన పంటలకు ఇంతవరకు నష్టపరిహారం చెల్లించలేదని రైతాంగం వాపోయారు. పడిపోయిన ఇళ్ళ నిర్మాణం కూడా మొదలు పెట్టలేదు. గత నాలుగు నెలలుగా గ్యాస్ సబ్సిడి ఏ ఒక్కరికీ రాలేదు. డ్వాక్రా మహిళలు ఉపాధి పనులకు కెళ్తుంటే సగం రోజులు మాత్రమే పని దొరుకుతుంది. గ్రామంలో సమస్యల్ని పరిష్కరించుకునే ప్రయత్నం చేస్తున్నారు. బెల్ట్ షాపులని మహిళలే పూనుకొని తొలగించారు. దాంతో కుటుంబంలో మహిళలపై కొట్టడం తగిందని తెలిపారు. తాగుడు ఎత్తివేయడమే కాక ఎవరయినా పురుషుడు మరో వివాహానికి పూనుకొంటే వాటిని మహిళలు నివారిస్తున్నట్లు చెప్పారు. ప్రభుత్వం డ్వాక్రా మహిళలకు పెద్ద ఎత్తున ఉపాధి శిక్షణ సదుపాయాలు కల్పిస్తున్నట్లు నెలకు 10,000 ఆదాయం వచ్చే పథకాలు రూపొందిస్తున్నట్లు చెప్పిన వ్యాఖ్యలు ఎక్కడా అమలు కాలేదు. స్థానికంగా ఉత్పత్తి అయ్యే చింతపండు, పసుపు, చిరుధాన్యాలు, కాఫీ గింజలు, తదితర వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగ్ మరియు మార్కెటింగ్ శిక్షణ మరియు అందుకు అవసరమైన రుణాలు ఇస్తే ఉపయోగమని అలాంటి సదుపాయాలేమీ కల్పించలేదని వాపోయారు.

# ఐద్వా నేతను అడ్డుకున్న హర్యానా సర్కార్

విద్యాసంస్థల్లో ప్రభుత్వ జోక్యాన్ని ఖండించిన మేధావులు బిజేపీ ప్రభుత్వం విద్యా సంస్థల స్వయంప్రతిపత్తిని దెబ్బతీస్తున్నదనే విమర్శలు దేశవ్యాప్తంగా వెల్లువెత్తుతున్నాయి. తాజాగా హర్యానా ఖాన్‌పూర్ కలాన్‌లోని బీపీఎస్ మహిళా విశ్వవిద్యాలయంలో జరిగిన ఒక చర్చాగోష్ఠిలో పాల్గొనాల్సిన ఐద్వా ప్రధాన కార్యదర్శి జగ్‌మతి సాంగ్వాన్‌కు నిర్వాహకులు చివరి నిమిషంలో ఆహ్వానాన్ని ఉపసంహరించుకున్నారు. రాష్ట్రముఖ్యమంత్రి ఒత్తిడితోనే ఆమెకు ఆహ్వానాన్ని రద్దు చేశారని పలువురు అధ్యాపకులు ఒక ప్రకటనలో ఆరోపించారు. వివరాల్లోకెళ్తే... 'భారత్‌లో సామాజిక ఉద్యమాలు- సుస్థిర అభివృద్ధి'అనే అంశంపై మే 13న చర్చాగోష్ఠిని నిర్వహించాలని విశ్వవిద్యాలయ అధికారులు నిర్ణయించారు. ఈ చర్చాగోష్టిలో ప్రధాన వక్తగా పాల్గొనాల్సిందిగా కోరుతూ జగ్‌మతికి ముందే ఆహ్వానం పంపించారు. అయితే వారు మే 12 రాత్రి జగ్‌మతికి ఫోన్ చేసి వక్తల జాబితాలోంచి ఆమె పేరును తొలగించి ఆమె పేరును తొలగించాలని ముఖ్యమంత్రి మనోహర్‌లాల్ ఖట్టర్ కార్యాలయం నుంచి ఆదేశాలు వచ్చాయని చెప్పారు. దాంతో ఆమె ఆ కార్యక్రమంలో పాల్గొనలేకపోయారు. ఈ చర్యను రాష్ట్రంలోని ప్రజాస్వామిక సంఘాలన్నీ తీవ్రంగా ఖండించాయి. దీనిపై ప్రభుత్వం వివరణ ఇవ్వాలని అవి డిమాండ్ చేశాయి. రాష్ట్ర ప్రభుత్వం లౌకిక, ప్రజాస్వామిక కార్యకర్తలను, విద్యావేత్తలను విద్యాసంస్థల్లోకి రాకుండా, ప్రసంగాలు చేయకుండా నియంతృత్వ పద్ధతుల్లో అడ్డుకోవడాన్ని సంఘాలు ఖండించాయి. రాష్ట్రంలో పంచాయితీ ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థులకు విద్యార్హతల నిబంధన విధిస్తూ రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని ఐద్వా నేత జగ్‌మతి సాంగ్వాన్ సవాలు చేశారన్నది గమనార్హం.



మంత్రి సునీతకు మెమొరాండం అందజేస్తున్న శ్రీదేవి




కాకినాడ సభలో ప్రసంగిస్తున్న మాజీ మున్సిపల్ చైర్‌పర్సన్ ప్రభాజోసెఫ్



అనంతపురంలో ఉగాది కవితాగానం



విజయవాడ సభలో మాట్లాడుతున్న కన్హయ్య




సామాజిక చైతన్య సభలో మద్దతిస్తున్న కళ్యాణి



అరెస్టయిన బ్రాండిక్స్ మహిళలను పరామర్శిస్తున్న రమాదేవి



పెదలవుడు గ్రామంలో పర్యటించిన ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు ప్రభావతి, గీతా



హెచ్.సి.యు విసి అప్పారావు ఘెరావ్ చేస్తున్న విద్యార్థినులు



మెప్మా మహిళల రాష్ట్ర సదస్సులో మాట్లాడుతున్న బ్యాంక్ మేనేజర్ త్యాగరాజన్



మహిళలు - చట్టాలు సదస్సులో మాట్లాడుతున్న సుంకర రాజేంద్రప్రసాద్


మహిళా కార్మికులపై అణచివేత చర్యలను ఖండించాలని ధర్నా చేస్తున్న బ్రాండిక్స్ మహిళలు


కుట్టు మిషన్ల పంపిణీ సభలో మాట్లాడుతున్న ఇ.డి


అంబేద్కర్ జయంతి సందర్భంగా నివాళులర్పిస్తున్న ఐద్వా సంఘ సభ్యులు



జిషా అత్యాచారంపై నిందితులపై చర్యలు తీసుకోవాలని ఐద్వా సంఘ సభ్యుల ప్రదర్శన


అమలాపురం ఉపాధిహామీ పనులను పరిశీలిస్తున్న సిహెచ్.రమణి


తిరుపతిలో ఐద్వా నిర్వహించిన కరాటే శిక్షణ



*Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Kalpana Prints Road, Krishna Lanka, Vijayawada. Ph. 9490098620, Printed at Prajasakti Daily Printing Press, Krishna Nagar, Tadepalli (M) Guntur Dt. Editor : D. Rama Devi*

| | |
|---|---|
|  | **మనసు ఫౌండేషన్**<br>**పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A151 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |